# భారత దేశంలో





మార్షల్ జి.ఝు
కోవ్‌కు జనవ
24న విమానా(
యంలో రక్ష
మంత్రి డాక్టర్
కట్జూ, కమ్యూ
నికేషన్స్ మ
(త్రి శ్రీ జగ్
వన్‌రాం మొ
దైనవారు సా
గత మిచ్చా(



పాలం విమానాశ్ర
యంలో సోవియట్
రాయబార కార్యా
ల యోద్యోగు ల
బాలలు మార్షల్
ఝుకోవ్‌కు స్వాగత
మిచ్చారు
(ఎడమను పైన)

★

ఉపాధ్యక్షులు డా
రాధాకృష్ణన్‌తో
మార్షల్ ఝుకోవ్
(ఎడమ)



మార్షల్ ఝుకోవ్, ప్రధాని నెహ్రూతో, ప్రధాని మందిరంలో (పైని)



మార్షల్ ఝుకోవ్. సోవియట్ రాయబారి ఎం. మెన్షికోవ్‌తో జనవరి 25 న,
రాష్ట్రపతి భవనంలో స్వాగతానికి వచ్చేస్తూ (ఎడమను, దిగువ)



రిపబ్లిక్ దినోత్సవ విన్యాసాల సందర్భంచను మార్షల్ ఝుకోవ్.
డాక్టర్ కట్జూతో వచ్చేసినప్పుడు (అంతర చిత్రం)

# మార్షల్ ఝుకోవ్





పాలం విమానా
శ్రయంలో సై
నిక వందనాన్ని
స్వీకరిస్తూ మా
ర్షల్ ఝుకోవ్
(కుడి)

మార్షల్ ఝుకోవ్,
బృందంలోని సభ్యు
లూ రాజ్‌ఘాట్
లోని గాంధీ సమా
ధికి పుష్పాంజలు
అర్పిస్తూ
(కుడిన పైని)

*

మార్షల్ ఝుకోవ్,
తమ గౌరవార్థం,
డాక్టర్ కట్జూ చేసిన
విందులో శ్రీమతి
శ్రీనగేష్‌తో సం
భాషిస్తూ (కుడి)





అధ్యక్షుని మార్షల్ ఝుకోవ్ సందర్శించినప్పుడు. (ఎడమనుండి కుడికి)
మార్షల్ ఝుకోవ్, డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, భారత దేశంలోని
సోవియట్ రాయబారి మెన్షికోవ్

న్యూఢిల్లీలో జనవరి 26న రిపబ్లిక్ దినోత్సవ విన్యాస దృశ్యం





మార్షల్ ఝుకోవ్
గజారోహణ

# రెండు మహాదేశాల మైత్రి

ప్రజా చైనా రిపబ్లిక్ ప్రధానమంత్రి చౌ ఎన్-లై, చైనా ప్రభుత్వ ప్రతినిధివర్గపు యితర సభ్యులూ, 1957 జనవరి 7 నుండి 11 వరకూ, తరవాత మళ్ళీ జనవరి 17 నుండి 19 వరకూ సోవియట్ దేశంలోవున్నారు. ఈ సమయంలో సోవియట్, చైనా దేశాల ప్రభుత్వాల ప్రతినిధివర్గాలు పరస్పరం అభిప్రాయాలను తెలుసుకున్నాయి. చర్చలు ముగిశాక ఒక సంయుక్త ప్రకటనపైని చేవ్రాళ్ళు జరిగాయి. వారు సోవియట్ దేశంలో వున్నప్పుడు మాస్కోలో జనవరి 17న, ఒక సోవియట్-చైనీస్ స్నేహసభ జరిగింది. దానిలో యన్. ఏ. బుల్గానిన్, చౌ ఎన్-లై ఉపన్యసించారు. ఆ ఉపన్యాసాలను సంక్షిప్తంగా ప్రచురిస్తున్నాము.

## ఎన్. ఎ. బుల్గానిన్ ఉపన్యాసం

సోవియట్ దేశానికీ, చైనా ప్రజారిపబ్లిక్కుకూ మధ్య, సోవియట్, చైనీస్ ప్రజలకు మధ్య స్నేహం నానాటికీ దృఢపడుతోంది, దిట్టపడుతోంది; మన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక సహకారం పూర్వంకంటె ఫలప్రదమవుతోంది. మన స్నేహం రెండు మహత్తర సామ్యవాద దేశాల స్నేహం, లెనినిస్టు సూత్రాలైన సమానత్వం, జాతీయ ప్రయోజనాలపట్ల పరస్పర గౌరవం, పరస్పరసోదర సహాయం, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో ఇంకొకరు జోక్యం కలిగించుకోక పోవడం, శ్రామికవర్గ అంతర్జాతీయతా ఆశయంపట్ల గాఢమైన వినయ విధేయతలపై స్థాపింపబడింది.





సోవియట్ దేశం, చైనా ప్రజారిపబ్లిక్కుల సోదర మైత్రి యావత్తు సామ్యవాద శిబిరంయొక్క, యావత్తు శ్రామిక మానవకోటి యొక్క గొప్ప చరిత్రాత్మక విజయం. ఈ మైత్రి శాంతికీ, దేశాల భద్రతకూ ఒక అతి ముఖ్యాంశం, సామ్రాజ్యవాదుల రాక్షస విధానాల మార్గంలో ఒక అధిగమించరాని నిరోధం. "మన దేశాల ప్రజల మైత్రి శాశ్వతమైనిది, అభేద్యమైనది, అవిచ్ఛిన్నమైనది" అని మాస్కోకు చేరిన తరవాత కామ్రేడ్ ఛౌఎన్-లై అన్నమాటలను గొప్ప సంతృప్తితో మనం ప్రస్తుతిస్తున్నాము.

(మిగత ప్రక్కపుటలో)

## ఛౌ ఎన్-లై ఉపన్యాసం

చైనీస్ అతిధులకు స్వాగతం యివ్వడానికి గ్రాండ్ క్రెమ్లిన్ భవనములో సమావేశమైన మాస్కో శ్రామిక ప్రజాప్రతినిధులు చాల మంది నుద్దేశించి ప్రసంగిస్తూ ఛౌఎన్-లై యిలా చెప్పారు:

"మీ మహత్తర దేశానికి నేను వచ్చి సుమారు రెండున్నరసంవత్సరాలయింది సోవియట్ ప్రజలు, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వాల నాయకత్వాన మహత్తర కర్తవ్యమైన కమ్యూనిస్టు నిర్మాణాన్ని సాధించడంలో ఇంకా ఉత్తేజకరమైన విజయాలను పొందడము, ఈ స్వల్పకాలంలో మేము చూశాము. ఇదంతా సోషలిస్టు వ్యవస్థలోని అసమానమైన లాభాలను మాత్రమే కాకుండా, యీ వ్యవస్థ క్రింద ప్రజలుచూపిన అపారమైన చొరవనూ, పరిశ్రమనూ కూడా ప్రదర్శించింది. చైనా ప్రజలు మీరు విజయాలు సాధించినందుకు సంతోషిస్తారు, వాటిని ప్రశంసిస్తారు వారు వాటిని తమ విజయాలుగా పరిగణించినందువల్ల.

ఈ రెండేళ్ళ పైచిలుకు కాలంలో చైనా ప్రజలుకూడా సోషలిజం నిర్మాణంలోనూ, సోషలిస్టు సంస్కరణలను అమలు పర్చడంలోనూ కొన్ని విజయాలను సాధించారు.

మా విజయాలన్నీ సోవియట్ ప్రభుత్వమూ, సోవియట్

(మిగత 6వ పుటలో)

## బుల్గానిన్ ఉపన్యాసం

(ముందు పుట మొదటికాలంతరువాయి)

సోషలిజం నిర్మాణంలో చైనా ప్రజలు సాధించిన విజయాల గురించి యింకా ప్రస్తావిస్తూ ఎన్. ఏ. బుల్గానిన్, యీ విజయాలు ఆసియా అంతటా రాజకీయ పరిస్థితిని బాగా మార్చివేసి, అనేక ఆసియా దేశాలు దేశ స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడానికి ఎంతో సౌలభ్యాన్ని కలుగజేశాయనీ, యివి శాంతిరంగాన్ని సంఘటితపర్చడమే కాకుండా అంతర్జాతీయ రంగంలో శక్తుల పారస్పరిక సంబంధాన్ని బాగా మార్చివేస్తాయి కూడాననీ ఉద్ఘాటించారు.

ప్రజా చైనా రిపబ్లిక్కుపట్ల కొన్ని సామ్రాజ్యవాద వర్గాల దురుద్దేశం గురించి, మిత్రరాజ్య సమితిలోనూ, తదితర అంతర్జాతీయ సంఘాలలోనూ ప్రజాచైనా రిపబ్లిక్కు యొక్క న్యాయయుతమైన హక్కుల పునరుద్ధరణకు ప్రయత్నం సాగించడానికి సోవియట్ దేశానికిగల ఉద్దేశం గురించి యన్.ఏ. బుల్గానిన్ ప్రసంగించి, తైవాన్, చైనాయొక్క తదితర ఆక్రమిత ద్వీపాలు, చైనా ప్రజా రిపబ్లిక్కుతో మళ్ళీ ఐక్యంకాగలవన్న విశ్వాసాన్ని ప్రకటించారు.

అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ సమీప, మధ్య ప్రాచ్యాలలో సాయుధ సేనలను ఉపయోగించడానికి అధికారాన్ని కోరుతూ కాంగ్రెసుకు యిటీవల యిచ్చిన సందేశాన్ని ప్రస్తావిస్తూ యన్. ఏ. బుల్గానిన్, అమెరికా తన ప్రచ్ఛన్నయుద్ధ విధానాన్ని, అంతర్జాతీయ సంబంధాలలో ఉద్రిక్తతను తీవ్రతరం గావించడాన్ని మానుకోలేదనడానికి యిదొక సూచన అన్నారు.

ఆరబ్ ప్రజలకు కమ్యూనిస్టు, సోవియట్ ప్రమాదం గురించి కాంగ్రెసుకు అధ్యక్షుని సందేశం చెపుతోంది. ఇది అమెరికా దురాక్రమణ విధానాన్ని సమర్థించడానికి, సమీప, మధ్య ప్రాచ్యదేశాల ప్రజలను హడల కొట్టడానికి ప్రయత్నంతప్ప వేరేమీకాదని యన్.ఏ. బుల్గానిన్ అన్నారు. ఈ ఉద్ఘాటనల దివాళాకోరుతనమూ, అయుక్తత సుస్పష్టం. ఇతర దేశాలతో మన సంబంధాల విషయంలో శాంతియుత సహజీవనం, యితర దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకొనకపోవడం అన్న సూత్రాలకు మనం ఖచ్చితంగా కట్టుబడివుంటా మన్నది అందరికీ తెలిసిన విషయమే.

ఐసెన్‌హోవర్ సూత్రం సమీప, మధ్యప్రాచ్యాలలో, ఆయుధ బలంపైని ఆధారపడే ఒక ఆర్థిక, రాజకీయ విస్తరణ పథకం. ఇది నూతన ఆకారంలో ఒక వలస విధానరూపం; దీనిని అమెరికా గుత్త వ్యాపారులు పాతరకపు వలసరాజ్యాధిపతులను, ఉదాహరణకు బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులవంటివారిని జయప్రదంగా బయటికి నెట్టి గలిగినచోట స్థాపించడానికి ప్రయత్నిస్తున్నారు.

అమెరికా ఆరబ్ దేశాల ఆర్థిక కష్టాలను అవకాశంగా తీసుకోవడానికి ప్రయత్నిస్తూ, వారికి తన "సహాయా"న్ని యిస్తానంటున్నది. సమీప, మధ్య ప్రాచ్య దేశాల ప్రజలు యీ సహాయమన బడేదాని అంతరార్థ మేమిటో గ్రహించగలుగుతారనడానికి సందేహమేమీ లేదు.

మాకు సంబంధించినంతవరకూ సమీప, మధ్యప్రాచ్యప్రజలకు స్వాతంత్ర్యసాధనకు ఆ ప్రాంతంలో శాంతి భద్రతల స్థాపనకు వారి పోరాటంలో విజయం ప్రాప్తించాలని ఆశిస్తున్నాము.

సోషలిజం విజయాలు నానాటికీ వృద్ధి చెందుతాయని యన్.ఏ. బుల్గానిన్ అన్నారు. కాని నవజీవన నిర్మాణం చిక్కులు లేకుండా, సాఫీగా సాగుతుందని అనుకోవడం పొరపాటు. అమెరికా నాయకత్వాన పెట్టుబడిదారీ ప్రపంచం, సోషలిజం జయప్రదంగా అభివృద్ధి కాకుండా నిరోధించేందుకు, గొప్ప ప్రయత్నాలు చేస్తోంది, పెద్ద మొత్తాలు ఖర్చుచేస్తోంది.

హంగరీలోని ప్రతివిప్లవ కలహం రెండు వ్యవస్థలకు మధ్య —పెట్టుబడిదారీ, సోషలిస్టు వ్యవస్థలకుమధ్య తీవ్రపోరాటానికి ఒక విస్పష్టరూపం. ప్రతివిప్లవ శక్తులు హంగెరిలో పెట్టుబడిదారీ వ్యవస్థను, హార్తీమైట్ ఫాసిస్టుల రాజ్యాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నించాయి. సామ్రాజ్యవాద పథకాలు విఫలమయ్యాయి. కాదర్ ఆధిపత్యాన విప్లవ కార్మిక కర్షక ప్రభుత్వం విప్లవశక్తులను సంఘటిత పరిచింది. కార్మిక కర్షకప్రభుత్వ పైని విజ్ఞప్తి సోవియట్ దేశం సకాలంలో చేసిన సహాయం, హంగేరియన్ శ్రామిక ప్రజల సామ్యవాద విజయాలను రక్షించడానికి తోడుపడింది.

సోషలిజం కోసం, ప్రతివిప్లవానికి వ్యతిరేకంగా హంగేరియన్ ప్రజల పోరాటంలో వారికి సహాయపడడం, శ్రామికవర్గ సంఘీభావ సూత్రంపైని ఆధారపడిన మన అంతర్జాతీయ విధి. హంగెరీలో సోషలిజం రక్షణకు పూనుకోవడంలో, హంగెరీ శ్రామికప్రజల విజయాలు మాత్రమే కాకుండా యితర దేశాల శాంతిభద్రతల భవిష్యత్తు కూడా ప్రమాదాన్ని ఎదుర్కొంటోందని మేము గుర్తించాము.

హంగెరీలోని ప్రతివిప్లవ కలహం విషయంలో మన చైనీస్ మిత్రులు అనుసరించిన విస్పష్టమైన, దృఢమైన దృక్పథాన్ని మనమెంతో ప్రశంసిస్తున్నాము. ఈ దృక్పథం సోవియట్ దేశపు దృక్పథానికి పూర్తిగా అనుగుణంగా వుంది.

చైనా ప్రజారిపబ్లిక్కు, సోవియట్ దేశాల ప్రభుత్వ ప్రతినిధి వర్గాలమధ్య జరిగిన సంప్రదింపుల గురించి మాటాడుతూ ఎన్. ఏ. బుల్గానిన్ యిలా అన్నారు; ప్రస్తుత అంతర్జాతీయ విషయాలపైని, మన దేశాలమధ్య సహకారాన్ని యింకా పెంపొందించె మార్గాల గురించి మేము పరస్పరం అభిప్రాయాలను తెలుసుకున్నాం.

మా సంభాషణలు అవ్యాజత, స్నేహపూర్వక పరస్పర అవగా

హనల వాతావరణంలో సాగాయి; పరస్పర అభిప్రాయప్రకటన సంపూర్ణ ఏకీభావాన్ని, నేటి పరిస్థితిలో మన సమాన కర్తవ్యాల గాఢ అవగాహననూ వెల్లడించింది.

ఇప్పుడు మన అతి ముఖ్యమైన కర్తవ్యం, మార్క్సిజం-లెనినిజం సూత్రాల కనుగుణంగా సోషలిస్టు శిబిరంలోని శక్తులను అత్యధికంగా సమీకరించడమూ, 1956 అక్టోబరు 30వ తేదీ సోవియట్ ప్రభుత్వ ప్రకటనలో పొందుపరుపబడిన లెనినిస్టు సమానత్వ సూత్రాల ప్రాతిపదిక పైని మైత్రిని పెంపొందించడమూ, సంఘటిత పరచడమూనని యన్. ఏ. బుల్గానిన్ అన్నారు.

ప్రచ్ఛన్న యుద్ధవాతావరణంలో సోషలిస్టు నిర్మాణం, రాజకీయ, ఆర్థిక కష్టాలు చాలవాటిని ఎదుర్కొంటుంది. తమ్ము ఎదుర్కొంటోన్న కష్టాలను అధిగమించడంలో సోషలిస్టు దేశాలు తమ స్వీయ శక్తిసామర్థ్యాలపైని, సోషలిస్టు శిబిరంలోని సకల దేశాల సహకార, పరస్పర సహాయాలపైని ఆధారపడాలని, చైనీస్ కామ్రేడ్సుతో మేము చేసిన సంభాషణలలో పునరుద్ఘాటించాము. ఇది అత్యంత సక్రమమైన, కచ్చితమైన మార్గం.

సోషలిస్టు దేశాల స్నేహ సహకారాలు, సాంఘిక రాజకీయ వ్యవస్థల ప్రమేయం లేకుండా సకల దేశాలతోనూ శాంతియుత సహకారానికి అనుకూలమైన అవకాశాలను సృష్టిస్తాయని విశ్వసించడంలో ఉభయపక్షాలూ సంభాషణల సమయంలో ఏకగ్రీవాభిప్రాయాన్ని ప్రకటించాయి.

నిరాయుధీకరణ ఒడంబడికను చేసుకోడానికి అన్నివిధాలా ప్రయత్నాలు సాగించాలని తాము అంగీకరించామని ఎన్.ఏ. బుల్గానిన్ చెప్పారు. సాయుధసేనల తగ్గింపుపైని, అణుశక్తి, హైడ్రోజెన్ ఆయుధాల ప్రయోగం, పాటవ పరీక్షల నిషేధంపైని, కంట్రోలు, వైమానిక పర్యవేక్షణలపైని సోవియట్ దేశం చేసిన సరికొత్త ప్రతిపాదనలు యితర దేశాలతో ఒడంబడికకు మంచి ప్రాతిపదిక కాగలవు.

దూరప్రాచ్యం విషయంలో, సోవియట్ దేశం, చైనా ప్రజారిపబ్లిక్కు ఒకవేపున. యింకోవేపున జపాను మధ్య సంబంధాల స్థాపన, అభివృద్ధి, జపానుప్రజల ప్రధాన ప్రయోజనాలకు అనుగుణముగా వున్నట్టుగానే, సోవియట్ దేశం, చైనాదేశం ప్రధాన ప్రయోజనాలకు కూడా అనుగుణంగా వుంటుందన్న విశ్వాసాన్ని మేము వ్యక్తం చేశాము,

---

## చౌ ఎన్-లై ఉపన్యాసం

(4వ పుట రెండవకాలం తరువాయి)

ప్రజలూ యిచ్చిన తోడ్పాటు, సహాయాలతో అవినాభావమైనవని చైనా ప్రజలు పూర్తిగా ఎరుగుదురు. చైనా ప్రజారిపబ్లిక్ స్థాపింపబడినప్పటి నుండీ అప్పులు యివ్వడంద్వారా, మాకు యంత్రసామగ్రినీ, వస్తువులనూ సరఫరా చేయడంద్వారా, తన ప్రవీణులను చైనాకు పంపడం ద్వారా, ఇంకా యితర విధాలా సోవియట్ దేశం మాకు పెద్దగా సర్వతోముఖమైన సహాయాన్ని చేస్తోంది. 156 ప్రధాన పారిశ్రామిక సంస్థలను నిర్మించడానికి సోవియట్ దేశం మాకు సాయపడుతోంది; ఇవి మా ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని మా పారిశ్రామిక నిర్మాణానికి మూలకందంగా వుండేటటువంటివి. శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి బద్ధమైన మహత్తర సోషలిస్టు రాజ్యమైన సోవియట్ దేశంవంటి దేశం మాత్రమే మా దేశానికి ఇటువంటి స్నేహపూర్వకమైన, మహత్తరమైన సహాయాన్ని చేయగలదు.

అక్టోబరు విప్లవజ్యోతిచే ప్రకాశితమైన మార్గాన మేము నడుస్తున్నందు వల్లనే మేము గడించిన విజయాలన్నీ సాధింపబడ్డాయని చైనీస్ ప్రజలకు సుగ్రాహ్యమే. శాస్త్రీయ సామ్యవాదాన్ని సజీవ వాస్తవికతగా పరివర్తనగావించిన, ప్రపంచంలోని ప్రథమదేశం సోవియట్ దేశం. విప్లవానుభవమూ, సోవియట్ దేశంలోని నిర్మాణస్థాయి దాని ప్రత్యేక జాతీయలక్షణాల కనుగుణమైనట్టు మార్క్సిజంను సృజనాత్మకంగా వర్తింపజేయడంలో ఉత్తమోత్తమమైన దృష్టాంతాలు. సోవియట్ దేశం మాకు అభివృద్ధి చెందిన అనుభవ సంపదనూ, విలువైన గుణపాఠాలనూ యిచ్చినందు వల్లనే చైనాప్రజలు విప్లవాన్ని, నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించడంలో తమకు ఉపయోగకరమైన దానిని చాలా నేర్చుకున్నారు; చుట్టుతిరుగుడు త్రోవలను చేపట్టకుండా జాగ్రత్తపడ్డారు. చైనాప్రజలు, యింతకుపూర్వం తాము చేసినట్టుగానే అడకువతోనూ, పరిశ్రమతోనూ సోవియట్ దేశంనుండి నేర్చుకోవడమూ, మీ అభివృద్ధిచెందిన అనుభవాన్నీ. మీ అభివృద్ధిచెందిన విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలనూ అధ్యయనం చేయడమూ సాగిస్తారు. అక్టోబరు విప్లవము వెలుగులు వెదజల్లిన పథం విజయ పరంపరకు దారితీసే పథమని చైనా ప్రజలు, తమ పోరాటం అనుభవంనుండి యిప్పటికే తెలుసుకున్నారు."

అంతర్జాతీయ పరిస్థితిలో యీ రెండేళ్ళ పైచిలుకు కాలంలో వచ్చిన మార్పులనుగురించి మాట్లాడుతూ చౌ ఎన్-లై యిలా అన్నారు: "సోవియట్ దేశ నాయకత్వాన సోషలిస్టు దేశాలు అనుసరించిన శాంతియుత విదేశాంగ విధానాల ప్రభావం మూలంగా సోషలిస్టు దేశాలూ ప్రపంచంలోని యితర శాంతికాముక దేశాలూ కలసిచేసిన కృషి మూలంగానూ అంతర్జాతీయ ఉద్రిక్తతలో బాగా తగ్గుదల తీసుక

రాబడింది. కాని పరిణామ ధోరణి సామ్రాజ్యవాద దురాక్రమణ కూటాల ఆశయాలకు విరుద్ధంగావుంది. అవి, ఈజిప్టుకు వ్యతిరేకంగా బాహాటంగా దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభించి, సోషలిస్టు దేశాలను కూలద్రోయడానికీ. యీ దేశాల ఐక్యతను కూలద్రోయడానికీ తమ కృషిలో యింకా ఉగ్రతను చూపాయి. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిలో యిదంతా కొంత తీవ్రతను కలిగించింది. మహత్తర సోవియట్ దేశ నాయకత్వాన ఐక్య, సంఘటిత సోషలిస్టు శిబిరం ప్రపంచ శాంతికీ, మానవ ప్రగతికీ అత్యంత ముఖ్యమైన దుర్గం; తమ దురాక్రమణ చర్యలనూ, సైనిక బెదిరింపులనూ అమలు జరపకుండా సామ్రాజ్యవాద రాజ్యాలను ఆటంకపరచడానికి ఒక పెద్ద నిరోధం కూడా. ఇందువల్లనే సామ్రాజ్యవాద రాజ్యాలు ఎప్పుడు సోషలిస్టు దేశాలను నాశనం చేయడానికి ప్రయత్నిస్తాయి, వాటిమధ్య ఐక్యతను భగ్నం గావించడానికి అన్నివిధాలా ప్రయాసపడతాయి. హంగెరీలో జరిగినది, సామ్రాజ్యవాద రాజ్యాలు సోషలిస్టు శిబిరంపై చేసిన సుస్పష్టమైన ద్వేషపూరితమైన సిగ్గుచేటయిన దాడి. కాని సామ్రాజ్యవాదుల అంచనాలు విఫలమైనాయి. హంగేరియన్ కార్మికులు తమ సోషలిస్టు వ్యవస్థ రక్షణకు పూనుకున్నారు, హంగేరియన్ విప్లవ కార్మిక కర్షక ప్రభుత్వ నాయకత్వాన, సోవియట్ సేన సహాయంతోనూ సామ్రాజ్యవాదుల, విప్లవ ప్రతికూలుర కుట్రను తుత్తునియలు గావించారు. ప్రస్తుతం హంగెరీలోని రాజకీయ పరిస్థితి, ఆర్థిక జీవితమూ క్రమక్రమంగా సాధారణ స్థితికి మళ్ళుతోంది. సోషలిస్టు శక్తులకు యిదొక ముఖ్యవిజయం. ఈ పరిణామాలలో మహత్తర సోవియట్ ప్రజ, సోవియట్ సేన మళ్ళీ శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రానికి తమ విధేయతను రుజువుచేసుకుని, శాంతికీ, సోషలిజంకు మహత్తరంగా సేవచేశాయి.

హంగెరీలో సామ్రాజ్యవాదుల ప్రతివిప్లవ కుట్ర, ఈజిప్టు ప్రజలపై వారి రాక్షస దండయాత్రకు అనుగుణంగానే వుంది. ఆసియా, ఆఫ్రికా దేశాలలో వలస విధానానికి వ్యతిరేకంగా, జాతీయ స్వాతంత్ర్యం కోసం ఉద్యమం పెంపొందడం చూసి వారు హడలిపోతున్నారు.

హంగెరిలో సామ్రాజ్యవాదుల సాహసచర్య, ఈజిప్టుపైని వారి దండయాత్ర పూర్తిగా విఫలమైనాయి. కాని తమ ఓటములవల్ల వారు ఊరకనే వుంటారని కాదు దీని అర్థం. మిత్రరాజ్యసమితి ద్వారా హంగెరీలో జోక్యం కలుగజేసుకోవడానికి వారింకా ప్రయత్నిస్తూనే వున్నారు. డంబగంభీర నినాదాలను, అబద్ధాలనూ యింకా వారు ప్రచారం చేస్తూనేవున్నారు, మూర్ఖజాతీయతావాద భావాలను రేకెత్తించడానికీ, సోషలిస్టు దేశాల ఐక్యతను భగ్నం గావించడానికీ యింకా ప్రయత్నిస్తూనే వున్నారు,

ఇంకోవేపున, సమీప, మధ్యప్రాచ్యాలలో బ్రిటన్, ఫ్రాంసు దేశాల స్థానాలు బలహీనపడడంవల్ల, అమెరికా ఆకలి ఎక్కువైంది. "ఐసెన్‌హోవర్ సూత్రా"నికి వెనుకనున్న ఉద్దేశం — యిది కొద్దికాలం క్రితం ప్రచురింపబడింది—ఆ ప్రాంతపు ప్రజలను అన్నివిధాలా తన ఆర్థిక, రాజకీయ ఆధిపత్యం క్రిందికి తీసుకరావడమూ, ఆ ప్రాంతపు ప్రజలకు వ్యతిరేకంగా ప్రత్యక్ష సాయుధ జోక్యంవరకూ సైతం విరుద్ధసైనిక ఒడంబడికల సహాయంతో తన విస్తరణను ఆ ప్రాంతంలో తీవ్రతరం గావించడమున్నూ. ప్రపంచంలోని సోషలిస్టు దేశాలూ, శాంతికాముక దేశాలూ తప్పక యింకా జాగరూకతతో వుండవలసిన అవసరాన్ని, సామ్రాజ్యవాదుల కుట్రలు కూహకాలన్నిటినీ వమ్ముచేయడానికి విసుగు విరామమూ లేకుండా పోరాడవలసిన అవసరాన్ని కలిగిస్తుం దిదంతా.

శాంతిని సుస్థిరం గావించేందుకు, అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించేందుకూ మన సోషలిస్టు దేశాలు ఎల్లప్పుడూ పెద్దగా కృషి చేస్తున్నాయి. సోవియట్ దేశం నిరాయుధీకరణ కొరకు యిటీవల చేసిన ప్రతిపాదనలు, శాంతికి యింకొక ముఖ్యమైన సేవగా వున్నాయి. విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాల శాంతియుత సహజీవనం కొరకు, పరస్పర దౌత్య, ఆర్థిక, సాంస్కృతిక సంబంధాల అభివృద్ధి కొరకు, సకల దేశాల ప్రజలమధ్య యింకా సన్నిహితమైన సంపర్కాల, సంబంధాల కొరకూ మనం దృఢచిత్తులమైవున్నాము.

సోవియట్, చైనాదేశాలమైత్రి, ఐక్యత సోషలిస్టు దేశాల దృఢమైన ఐక్యతకు ఒక ముఖ్యాంశం. మన ఉభయప్రజల మైత్రి, ఐక్యత మన ఎనభైకోట్లమంది ప్రజల మూలప్రయోజనాలకు పూర్తిగా అనుగుణంగా వున్నాయి. దేశాల సమానత్వం, శ్రామికవర్గ అంతర్జాతీయత అన్న మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలపైని మన ఐక్యత ఆధారపడివుంది. అందువల్లనది శాశ్వతం, అభేద్యం, అనుల్లంఘనీయం. మనలను విడదీయగల శక్తి భువిలో లేదు."



# సోవియట్, చైనా దేశాల సంయుక్త ప్రకటన

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల సమాఖ్య ఆహ్వానంపైన చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వ ప్రతినిధివర్గం ఒకటి చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వ మండలి ప్రధాని, విదేశాంగ మంత్రి అయిన చౌ ఎన్-లై నాయకత్వాన సోవియట్ దేశంలో 1957 జనవరి 7 నుండి 11 వరకూ, 17 నుండి 19 వరకూ పర్యటించింది. చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వ ప్రతినిధివర్గము, దానితోపాటు వచ్చిన ఇతరులు సోవియట్ దేశంలో వున్న సమయంలో మాస్కో, ఇర్కుత్‌స్క్, ఓమ్‌స్క్, తాష్కెంట్‌లను సందర్శించారు. అనేక పారిశ్రామిక సంస్థలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, విద్యాసంస్థలు మొదలైనవాటినీ పరిశీలించారు.

ఈ సమయంలో సోవియట్ దేశ ప్రతినిధివర్గము, చైనా ప్రజా రిపబ్లిక్ ప్రతినిధివర్గము అంతర్జాతీయ పరిస్థితికి సంబంధించిన ముఖ్య సమస్యలపైన, సోషలిస్టుదేశాల మధ్య స్నేహసహకారాన్ని ఇంకా విస్తృతంచేసి పటిష్టం చేయడానికీ, సోవియట్ దేశం, చైనా ప్రజా రిపబ్లిక్‌ల మధ్య అలాంటి సహకారాన్ని మరింతగా పెంపొందించడానికీ సంబంధించిన సమస్యలపైన ఒకరి అభిప్రాయాలను మరొకరికి తెలుపుకొన్నాయి.

సోవియట్ దేశం తరపున సోవియట్ దేశ మంత్రి మండలి అధ్యక్షుడు ఎన్. ఎ. బుల్గానిన్, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ అధ్యక్షవర్గ సభ్యుడు, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రధమ కార్యదర్శి అయిన ఎన్. ఎస్. కృశ్చేవ్, సోవియట్ దేశ మంత్రిమండలి ప్రధమ ఉపాధ్యక్షుడు ఎ. ఐ. మికోయాన్, సోవియట్ దేశ విదేశాంగ మంత్రి డి. టి. షెపిలోవ్, చైనా ప్రజా రిపబ్లిక్‌లో సోవియట్ దేశ రాయబారి పి. ఎఫ్. యుదిన్ సంప్రదింపులలో పాల్గొన్నారు. సోవియట్ దేశం తరపున సోవియట్ దేశ ఉప విదేశాంగ మంత్రి ఎన్. టి. ఫెడొరెంకో, సోవియట్ దేశ విదేశాంగ శాఖ కొలీజియం సభ్యుడు ఎల్. ఎఫ్. ఇలియచోవ్, సోవియట్ దేశ విదేశ మంత్రాంగం దూరప్రాచ్యశాఖ అధిపతి ఐ. ఎఫ్. కుర్ద్యకోవ్ సంప్రదింపులకు హాజరయ్యారు.

చైనా తరపున చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వమండలి ప్రధాని, విదేశాంగ మంత్రి అయిన చౌ ఎన్-లై, చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వ మండలి ఉపప్రధాని మార్షల్ హోలుంగ్, చైనా ప్రజారిపబ్లిక్ ఉప విదేశాంగమంత్రి వాంగ్ చ్య-హ్సియాంగ్, సోవియట్ దేశంలోని చైనా రిపబ్లిక్ రాయబారి ల్యు హ్సియో సంప్రదింపులలో పాల్గొన్నారు

సమావేశాలు, చర్చలు, సంప్రదింపులు హృదయపూర్వక, మనఃపూర్వక, స్నేహవాతావరణంలో కొనసాగాయి.

## 1

మొత్తంమీద అన్ని విషయాలపైన ఒకరి అభిప్రాయాలు మరొకరికి తెలుపుకొన్న సందర్భంలో ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి

[మిగత 38 వ పుటలో)



మాస్కోలోని, క్రెమ్లిన్ భవనంలో సోవియట్-చైనా ప్రభుత్వ ప్రతినిధివర్గాల సంప్రతింపులు

# బౌమన్ ఉన్నత సాంకేతిక పాఠశాల దగ్గర

మాస్కోలోని బౌమన్ ఉన్నత సాంకేతిక పాఠశాలకు చెందిన యూగెనీ బెలోవ్, నికొలాయ్ అజరోవ్ అను యిద్దరు విద్యార్థులు ఈమధ్య మా మాస్కో విలేఖరిని కలవడానికి వచ్చారు. యూగెనీ, నికొలాయ్‌లు కేవలం విద్యార్థులు, కాబోయే ఇంజినీర్లు మాత్రమేకాదు, పత్రికా రచయితలు గూడాను. "బౌమనెత్స్" అను తమ పాఠశాల ముద్రిత పత్రిక సంపాదక వర్గంలో సభ్యులు. రాజధాని నగరంలోని అతి ప్రాచీన విద్యాసంస్థల్లో ఒకటైన ఈ పాఠశాలకు సంబంధించిన అనేక ఛాయాచిత్రాలను వారు తీసుకువచ్చారు. ఈ పాఠశాల 127 సంవత్సరాల క్రితం స్థాపితమయింది.

ఈ పాఠశాల నలువైపులా చెట్లువున్న ఒక గంభీరమైన ప్రాచీన భవనంలో వున్నది. ఆ భవనం 18వ శతాబ్దంలో నిర్మింపబడింది. ఫ్రెంచి దండయాత్ర సమయంలో 1812 లో మాస్కో నగరం తగులబడిపోయినప్పుడు గూడా ఆ భవనం చెక్కుచెదర లేదు. దాదాపు వంద సంవత్సరాల తర్వాత, 1905 రష్యా విప్లవకాలంలో ఆ భవనం మాస్కో సాయుధ తిరుగుబాటుయొక్క కేంద్ర కార్యాలయంగా వుండినది. నికొలాయ్ బౌమన్ అను ప్రఖ్యాత విప్లవకారుడు ఇక్కడే ఉపన్యాసాలిచ్చాడు. ఇప్పుడు అతనిపేరే ఆపాఠశాలకు పెట్టబడింది. ప్రఖ్యాతి గాంచిన అనేకమంది ఈ పాఠశాలలో పనిచేశారు. "రష్యా విమానశాఖ పితామహుడు" ఝుకోవస్కీ, ఆధునిక విమానాల డిజైనరుగా ప్రఖ్యాతిగాంచిన తుపలేవ్ ఇక్కడ పనిచేసినవారే. సిద్ధాంత అధ్యాపనకు, ప్రాక్టికల్ ట్రెయినింగుకు పేరుపొందిన యీ పాఠశాల ప్రఖ్యాతి ప్రపంచమంతటా గుర్తింపబడింది. ఈ సంప్రదాయమే నేటికిగూడా ఈ పాఠశాలలో పరిపోషింపబడుతున్నది. ఇప్పటికిగూడా బౌమన్ ఉన్నత సాంకేతిక పాఠశాల విద్యార్థులు ఉపన్యాసాలు వినడంలోను, విద్యాగోష్ఠులలోను గడిపినంతకాలం ప్రాక్టికల్ ట్రెయినింగులో గూడా గడుపుతారు.



మాస్కోలోని బౌమన్ ఉన్నత సాంకేతిక పాఠశాల

ఫిట్టర్స్ షాపులోని ప్రథమ సంవత్సరపు విద్యార్థులు ఆకురాయితో పనిచేయడం ఇంకా అప్పుడప్పుడే నేర్చుకొంటుంటారు. కాని సున్నిత పనిముట్లు తయారుచేసేశాఖ పరిశోధనాలయాల్లోని విద్యార్థులిప్పుడే క్లిష్టమయిన గణిత యంత్రాలతోను, కంట్రోలు పనిముట్లతోను పనిచేస్తున్నారు.

అనుభవజ్ఞులైన టీచర్లు ప్రొఫెసర్లు, ఆయా శాఖల అధిపతులుగూడా విద్యార్థుల ప్రాక్టికల్ ట్రెయినింగును పర్యవేక్షిస్తూ వుంటా . ప్రెషరు మెటల్-వర్కింగ్ శాఖ అధిపతి ప్రొఫెసర్ అనతోలి జిమిన్, విద్యార్థులు క్రాంక్-ప్రెస్ దగ్గర పనిచేస్తూవుంటే ఎంత శ్రద్ధగా పరిశీలిస్తున్నారో రెండవ ఛాయా చిత్రంలో చూడవచ్చును. (కుడి)





ఈ పాఠశాల విద్యార్థులకు, ప్రొఫెసర్లకు తమ దేశ సరిహద్దులకు ఆవలగూడా అనేకమంది మిత్రులున్నారు. పాఠశాల పూర్వ విద్యార్థులనుండి—చైనా, పోలెండ్, కొరియా, రుమేనియాదేశాల పౌరులనుండి—తరుచు ఉత్తరాలవస్తూ వుంటాయి. ఈ దేశాలకుచెందిన అనేకమంది యువకులు ఇప్పుడుగూడా ఇక్కడ చదువుతున్నారు. మిత్రదేశమైన చైనా నుండివచ్చి చదువుకొంటున్న లెంగ్-తు చిత్రం చూడండి. అతడు యెంతో శ్రద్ధగా క్లిష్టమయిన ఒక డ్రాయింగును వేస్తున్నాడు. (పైన)

ఇక కళాశాల పఠన మందిరంలో చూద్దాము. విద్యార్థులు సిద్ధాంత గ్రంథాలను, నోట్సును చదువుకొంటున్న ఇక్కడ ఒక అసాధారణమైన వాతావరణం అగుపడుతూ వుంటుంది. ఈ యువతీ యువకులు తమ సాధారణ గ్రంథపఠనం నుండి మరి దేనివైపో ఆకర్షితులయ్యారు. వీడుభూముల్లో పనిచేస్తున్న తమ మిత్రులకు వారు ఉత్తరం వ్రాస్తున్నట్లు కనబడుతున్నది. గత ఆకురాలు కాలంలో ఈ విద్యార్థులు సమిష్టి వ్యవసాయ క్షేత్రదారులకు పంటకోతల్లో సహాయం చేయడానికి బీడు భూములకు వెళ్ళారు. వీరు అక్కడ కంబైన్ ఆపరేటర్లుగాను ట్రాక్టర్ డ్రైవర్లుగాను పనిచేశారు. విశ్రాంతి సమయాల్లో సమిష్టి వ్యవసాయక్షేత్రివాళ్లకు కళాప్రదర్శనలు ఇచ్చేవారు. ఈవిధంగా వారికి వ్యవసాయ కార్మికులతో స్నేహం యేర్పడింది. (దిగువ)





డ్రాయింగు బోర్డులపైన డ్రాయింగులతో మరొక పెద్దగదిలో వాతావరణం గంభీరంగా అగుపడుతుంటుంది. ఇక్కడ ఆఖరు సంవత్సరపు విద్యార్థులు ప్రాజెక్టుల డిప్లమా కోర్సుకు సిద్ధమవుతున్నారు. త్వరలో లిదియా యగొరోవా ఒక ట్రాక్టర్ ఇంజన్ డిజైనును తయారు చేయవలసి వున్నది. ఒక కమీషన్ ముందు తాను తయారుచేసినది సృజనాత్మకమైన సరి కొత్త డిజైను అని రుజువు చేసుకొనవలసి యున్నది. ఇది చాలా బాధ్యతగల క్లిష్టమైన పని అన్నమాట నిజమే. కాని ఇరవై సంవత్సరాల వయస్సులో, అందులోను మిత్రుల మధ్య వున్నప్పుడు, పనిలో మునిగి వుండటం అన్నది కష్టమైన పనే. అందుకే అంతటి "అతి పవిత్రమైన స్థలంలో" గూడా అప్పుడప్పుడు. ఛలోక్తులు, హాస్యము వినవస్తూవుంటాయి (ఎడమ)



విదేశీ ప్రతినిధి వర్గాలు ఈ పాఠశాలను సందర్శించినప్పుడు ఈ ఆతిథేయులు యెంత ఆనంద పడతారనుకున్నారు. దిగువ ఛాయాచిత్రంలో బామన్ పాఠశాల విద్యార్థులు స్వీడిష్ కళాశాల విద్యార్థులకు వీడ్కోలు నిస్తుండడం చూడవచ్చును. ఆ విద్యార్థులు స్టాక్‌హోమ్ పాలీటెక్నికల్ విద్యాసంస్థనుండి వచ్చారు.

ఇక్కడ సేడియంలో జరిగే పోటీల సందర్భంలోను, పాఠశాలలో జరిగే వ్యాయామ క్రీడల సందర్భంలోను ఉగుపడే ఆనంద వాతావరణం మరెక్కడా అగుపడదు.

సంప్రదాయకంగా జరిగే యీ పోటీల్లో పాఠశాల విద్యార్థులు, విద్యార్థినులకు అభిమానులైన క్రీడాకారులు పాల్గొంటుంటారు. తమ అభిమానులు పోటీలో పాల్గొంటున్నప్పుడు వారు పొందే ఉత్సాహానికి మేర వుండదు.

ఈ ప్రాచీన ఉన్నత విద్యాపాఠశాల యువక విద్యార్థుల జీవితం యెల్లప్పుడు కృషితోను, ఆనందంతోను కూడివుంటుంది. (పైన)



క్రీడలందే ఇక్కడి విద్యార్థులకు గొప్ప ఆసక్తి. వ్లాడ్లెన్ ఖొటులెవ్ (ఎదురుగానున్న ఛాయాచిత్రం) అంటే పాఠశాలలో అందరికీ తెలుసు ప్రొఫెసర్‌గాని ఎకడమిషియన్ గాని కాదతడు. పట్టభద్రానంతర విద్యను అభ్యసిస్తున్నాడు. స్కీయింగ్ ఛాంపియన్ అవడంచేత అతడు అంత ప్రఖ్యాతిని గాంచాడు. తమ పాఠశాలకు పేరు తెచ్చిన అతనిని గురించి విద్యార్థులు, ప్రొఫెసర్లు అంత ఘనంగా చెప్పుకోవడం సహజమైన విషయమే.

# "నా శక్తి ప్రజలకే అంకితం.."


జి. వి. ప్లెఖనోవ్

త్రమ దేశ ప్రజల జీవితంతోనూ, చరిత్రతోనూ దృఢమైన సంబంధాలుగల, అభిమానపాత్రులైన జిజ్ఞాసులూ, సిద్ధాంతకర్తలూ, తాత్త్వికులూ ప్రతిదేశానికీ వుంటారు.

రష్యన్ తత్త్వశాస్త్రవేత్త, విప్లవకారుడూ అయిన గియోర్గీ వాలెంతినొవిచ్ ప్లెఖనోవ్ – సోవియట్ ప్రజలు యీయన శతజన్మ దినోత్సవాన్ని యిటీవలనే జరిపారు—తన మాతృభూమికి దూరంగా సుమారు నలభై ఏళ్ల ప్రవాస జీవితాన్ని గడిపారు. రష్యా సౌభాగ్యంకోసం సర్వదా ఆలోచిస్తూ, తన యావత్తూ హృదయ శక్తినీ దానికి అర్పిస్తూ ఆయన చేసినట్టు విసుగు విరామాలు లేకుండా పాటుపడడము, నిజమైన విప్లవకారునికీ, దేశభక్తునికి మాత్రమే తగును.

"నేను రష్యాలో జన్మించాను. ఈ దేశాన్ని నేను గాఢంగా ప్రేమిస్తున్నాను....నా శక్తి రష్యన్ ప్రజలకు అంకితం .. బానిసలూ, భట్రాజులే కాకుండా రష్యాలో స్వాతంత్ర్యాన్ని గౌరవించడమూ, దానికి దోహదం చేయడమూ తెలిసిన వాళ్ళున్నారు. అధికారుల రష్యాయే కాకుండా విప్లవకారుల రష్యా, భావి రష్యా కూడా వుంది" అని ప్లెఖనోవ్ వ్రాశారు.

సోవియట్ ప్రజల దృష్టిలోనూ, సోవియట్ దేశపు దృష్టిలోనూ ప్లెఖనోవ్ మహత్తర గుణ సంపన్నుడు. రష్యా చారిత్రిక పరిణామాన్ని విశదపర్చడానికి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వర్తింపజేసినవారిలో ప్లెఖనోవ్ ప్రథముడు. రష్యా చారిత్రిక—జాతీయ భూమిలో మార్క్సిస్టు తాత్విక, విప్లవ సిద్ధాంతానికి పునాదివేసిన ఆయన గ్రంథులు, రష్యన్ సోషలిస్టుల తొలి మతం అన్నారు లెనిన్.

రష్యన్ మేధావుల అభిమానాన్ని చూరగొన్న నరోద్నిక్ సిద్ధాంతాలకు ప్లెఖనోవ్ చావుదెబ్బ కొట్టారు.

నరోద్నికులు (రష్యన్ పాపులిస్టులు) సామాజిక పరిణామ సూత్రాలను కాదన్నారు; చారిత్రిక క్రమం ప్రముఖ వ్యక్తుల కార్యకలాపాల ఫలితమని వారు భావించారు. వ్యక్తిగత హింసతోకూడిన వారి ఎత్తుగడలలో యీ అభిప్రాయాలు వ్యక్తపడ్డాయి. మార్క్స్, ఎంగెల్స్ రచనలను ప్రస్తావిస్తూ ప్రజలు మాత్రమే నిజమైన చరిత్ర నిర్మాతలనీ, సామాజిక పరిణామం బాహిర సూత్రాలకు లోబడిన సహజ చారిత్రిక క్రమమనీ ప్లెఖనోవ్ గొప్పగా నిరూపించేరు.


అధ్యయనంచేస్తూ జి. వి. ప్లెఖనోవ్

నరోద్నిక్కులు ఒక ఊహాజనితమైన, ఆచరణ సాధ్యంగాని సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు; రైతాంగం ద్వారా సోషలిజం రష్యాలో వస్తుందనీ, రష్యన్ భూమిలో పెట్టుబడిదారీ విధానం పెంపొందదనీ దీని తాత్పర్యం. భారీ ఎత్తున యాంత్రికోత్పత్తి చారిత్రికంగా తప్పనిసరి అన్న విషయాన్నీ, పెట్టుబడిదారీ ప్రాతిపదిక పైని సైతం దానికిగల నవవకాశాలనూ వారు గ్రహించలేదు, గ్రహించదలుచుకోలేదు. విప్లవోద్యమానికి రష్యన్ కార్మికవర్గం నాయక శక్తియని మొట్టమొదటగా ప్లెఖనోవ్ తెలియజేశారు.

ప్లెఖనోవ్ బహుముఖ శాస్త్ర పండితుడు, ఎంతో వైవిధ్యంగల విజ్ఞానరంగాలలో ఆయన కార్యకలాపాలను సాగించారు. ఆయన తత్త్వశాస్త్రం, చరిత్ర, ఆర్థికశాస్త్రం, విప్లవోద్యమానికి సంబంధించిన విషయాలూ, సారస్వతం, కళ మొదలైనవాటి సిద్ధాంత, చరిత్రలకు సంబంధించిన సమస్యలు—వీటిపైని రచనలు చేశారు.

రష్యాలోని నూతన, శ్రామికవర్గ కళకు ఆయన ప్రథమ సిద్ధాంతకర్త. కళయొక్క ఉన్నత భావవస్తువును, దాని కళాత్మక విలువకున్న అంగాంగీ భావైక్యత దృష్ట్యా పరిశీలించారు ప్లెఖనోవ్. కళస్థాయి, చిత్రింపబడిన మానవ వ్యక్తిత్వ విశిష్టలక్షణాలపైని, యీ వ్యక్తిత్వపు విశిష్ట భావనపైని నేరుగా ఆధారపడి వుంటుందని ఆయన చెప్పారు. గొప్ప కళలో ఘనమైన, కుతూహలజనకమైన మానవపాత్రలలో నిరంతర ఆసక్తి, మానవుని గురించి, అతని గమ్యం గురించి ఉదాత్తభావనలూ ప్రస్ఫుటంగా వుంటాయి. అందువల్ల గొప్ప కళ సర్వదా అమలిన మానవతాయుతం, ఉన్నతం, ప్రగాఢభావభరితం. ప్రఖ్యాత డచ్చి చిత్రకారుల గురించి ప్రసంగిస్తూ ప్లెఖనోవ్ వారి చిత్రాలు మానవాత్మను చూపినవన్నారు. గత శతాబ్దంలోనూ, యీ శతాబ్దపు ఆరంభంలోనూగల బూర్జువా చిత్రకారుల చిత్రాలతో మానవతాగుణమేదీ లేదని ఆయన అభిప్రాయాన్ని వెలిపుచ్చారు.

గత శతాబ్దపు చివరి దశాబ్దాలలోనే ప్లెఖనోవ్ శ్రామికవర్గ విప్లవోద్యమం, కళాభివృద్ధికి మూలాధారమని తెలియజేశారు. శ్రామికవర్గంనుండే అత్యంతగణనీయమైన, అత్యంత ఆశాజనకమైన మానవపాత్రలు ఉద్భవిస్తున్నాయన్నారాయన. శ్రామికవర్గ కళ, ప్రపంచ సంస్కృతీ ఉత్తమ విజయాల సహజ పరిణామమేనని ఆయన భావించారు.

ప్లెఖనోవ్ తాత్త్విక, కళాసంబంధదృక్పథాలన్నీ సరియైనవికావు. నరోద్నిచెస్త్వోకు వ్యతిరేకంగా ఆయన తుదివరకూ పోరాటాన్ని సాగించలేదు కూడానూ—దీనిని లెనిన్ చేశారు. అక్టోబరు విప్లవానికిగల ప్రగతిశీలమైన ప్రాముఖ్యాన్ని ఆయన గమనించలేకపోయారు; తన మాతృభూమికి దూరంగా చాలకాలం వుండడం దీనికి చాలవరకూ కారణమని చెప్పవచ్చును.

కాని ఒక తత్త్వశాస్త్రవేత్త స్థానాన్ని, ఆయన పూర్తిగావించలేకపోయిన దానినిబట్టి గాని, అవగాహన చేసుకొనలేక పోయినదానికి బట్టిగాని నిర్ణయించకూడదు; ఆయన చేసిన ప్రయోజనకరమైన కృషినిబట్టి, తన ప్రజల, సర్వ మానవుల తాత్త్వికభావ సంపదకు ఆయన చేకూర్చిన దానినిబట్టి నిర్ణయించవలసి వుంటుంది ఆయన స్థానాన్ని.

ప్లెఖనోవ్ చేసిన కృషి నిజంగా గొప్పది.



# సోవియట్ దేశంలో భారత దేశపు నూనె ఇంజనీర్లకు శిక్షణ

నూనె ఇంజినీర్లయిన భారతీయ యువక బృందమొకటి సోవియట్ దేశానికి వచ్చింది. సోవియట్ నూనె గనులలో వారు ప్రాక్టికల్ శిక్షణను పొందుతారు. ఇటీవల భారత ప్రభుత్వం నెలకొల్పిన నూనె, గ్యాసు కమీషన్ ఉద్యోగులు వీరంతా.

నూనె ఇంజినీర్లయిన యీ యువకులు, అజర్‌బైజాన్ రిపబ్లిక్ నూనె పరిశ్రమ నూనె మంత్రిత్వశాఖ అతిథులు. అజర్ బైజాన్ పారిశ్రామిక విద్యాలయంలోని డ్రిల్లింగ్ శాఖ ప్రధానాచార్యుడైన ప్రొఫెసర్ యస్. కులియేవ్ ఆధ్వర్యాన వీరు, సోవియట్ నూనె కేంద్రాలలో ఒకటైన బాకూలో ప్రాక్టికల్ శిక్షణను పొందుతారు. ఆరు నెలలలో యీ భారతీయ నిపుణులు సముద్రపు అడుగునగల నూనె డిపోజిట్టుల డ్రిల్లింగుకు సోవియట్ పద్ధతులు, టర్బయిన్ డ్రిల్లింగ్, యంత్రసామగ్రి నిర్వహణ మొదలైనవాటిని తెలుసుకుంటారు. స్వదేశానికి తిరిగివచ్చాక వారు డ్రిల్లింగు ఇంజినీర్లుగా పనిచేస్తారు.

**అంతర్జాతీయ సమీక్ష**

# "అధికార శూన్యత"ను గూర్చి ఆలోచనలా, ఆరబ్ ప్రజల ప్రయోజనాలా

## యస్. దాత్లిన్

యుద్ధానంతర కాలంలో, అంటే వలసవ్యవస్థ పతనమవుతున్న కాలంలో, అమెరికన్ సామ్రాజ్యవాదవర్గాలు, పాతవలస పెత్తందారీ రాజ్యాల వ్యవహారాలలోనూ, వలసదాస్య సంకెళ్ళను విసర్జించిన నూతన ప్రాచ్యరాజ్యాల వ్యవహారాలలోనూ అత్యున్నత న్యాయాధికారిపాత్రను నిర్వహించడానికి తరుచుగా ప్రయత్నిస్తున్నాయి. వలసవిధానానికి వ్యతిరేకులుగా నటిస్తూ, అవి ఆసియా, ఆఫ్రికా ప్రజల దృష్టిలో పరువు ప్రతిష్టలను పూర్తిగా కోల్పోయిన బ్రిటిష్, ఫ్రెంచి, తదితర వలసపెత్తందార్లతో సంబంధంలేకుండా వేరుగా వున్నట్లు వేషంవేస్తున్నాయి. అమెరికన్ "వలసవిధాన వ్యతిరేకత"ను గురించి కట్టుకథను వ్యాపింప జెయ్యడం అమెరికన్ ప్రచార ప్రధాన లక్ష్యాలలో ఒకటి అయింది.

కాని యీ లక్ష్యసాధన అతికష్టం. ఎందుకంటే, అడుగడుగునా, అమెరికన్ "వలసవిధాన వ్యతిరేకతా" ప్రచారం, వాస్తవ పరిస్థితితోను, యదార్థాలతోనూ, అమెరికన్ పాలకవర్గాల పద్ధతులతోనూ తీవ్రమైన వైరుధ్యంలో పడుతూంది. ముసుగు జారిపోతూనే వుంది, దానివెనుక దాగివున్న తోడేలు స్వరూపం వెల్లడవుతూనే వుంది.

ప్రాచ్యప్రజలనూ, పాతవలస పెత్తందారీ రాజ్యాలనూ కూడా మోసం చేయడానికీ, వలస వ్యవస్థమీద మరణశిక్ష విధించివేసిన చరిత్రనే, మోసగించడానికీ ప్రయత్నిస్తూ అమెరికా దొంగనాటక మాడుతూందని యదార్థాలు వెల్లడిస్తున్నాయి.

"ఐసెన్‌హోవర్ సూత్రం" వెలువడిన తరవాత యిప్పుడు, అమెరికన్ విధానం యొక్క వలస స్వభావం యింతకుముందెన్నడూ లేనంత సుస్పష్టంగా బయటపడింది. మధ్యప్రాచ్యంలోని అమెరికన్ విధానంలో కొత్తవిషయంగా అమెరికన్ పత్రికలు ప్రచారం చేసిన ఈ "సూత్రం", వలస విధానాన్ని మరుగుపరిచే అసంఖ్యాక పద్ధతులలో ఇటీవలి రకాలలో ఒకటితప్ప యింకేమీకాదు. ఈ సూత్రం ఆరబ్ ప్రజల జాతీయ వాంఛలకు వ్యతిరేకమైనది.

మధ్యప్రాచ్యంలో అమెరికన్ విధానం గురించి శాసనసభకిచ్చిన తన సందేశంలో తెలియజేసిన "ఐసెన్‌హోవర్ సూత్రం", మధ్యప్రాచ్య దేశాలను "రక్షించ"డానికి తనయిష్టమొచ్చినట్లు అమెరికన్ సాయుధ బలాలను ఉపయోగించడానికీ, ఈ ప్రాంతంలో "సైనిక సహాయ, సహకార" చర్యలను తీసుకోడానికీ అధ్యక్షునకు హక్కు నిస్తుంది.

ఆరబ్ దేశాలు అమెరికన్ సాయుధబలాలను తమ ప్రాంతాలకు ఆహ్వానించాలని ఎన్నడూ అనుకోనైనా అనుకోలేదని తెలిసిన విషయమే. అటువంటప్పుడు ఏ ఆధారంమీద అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇతర ప్రజల వ్యవహారాలలో జోక్యం కలిగించుకునే హక్కును తీసుకుంటున్నారు? అధ్యక్షుని సందేశంపై వ్యాఖ్యానిస్తూ అమెరికన్ రాజకీయవేత్తలూ, పత్రికలూ ఆరబ్ దేశాలలో బ్రిటిష్, ఫ్రెంచి పలుకుబడి బలహీనమైపోవడంవల్ల ఏదో "శూన్యత" ఏర్పడిందనీ, దానిని నింపడం అమెరికా బాధ్యత అనీ బోధపరచడానికి తంటాలు పడుతున్నారు.

"శూన్యత" అనే పదం, అమెరికన్ రాజకీయవేత్తల పరిభాషలో తమకెంతో యిష్టమైన పదాలలో ఒకటైంది. అయితే, యిప్పుడు అంతర్జాతీయ సూత్రం స్థాయికి తీసుకరాబడిన నిరంకుశ చర్యల విధానాన్ని సమర్థించడానికి ఈ పదానికి శక్తిలేదు. కాని దాని చుట్టూవున్న మెరుగులుపోయి అది, ఇటీవలే వలసపీడననుండి విముక్తిపొందిన నూతన రాజ్యాల ప్రజలపట్ల అమెరికన్ పాలకుల దృక్పథాన్ని మాత్రం తగినంత విస్పష్టంగా సరిగ్గా తెలియజేస్తూంది. గత జూన్‌లోనే, మధ్యప్రాచ్య వ్యవహారాలలో డల్లెస్‌కు సహాయకుడైన జార్జి ఎల్లెన్ రాజకీయ, సాంఘిక శాస్త్రాల పరిషత్తు సమావేశంలో ప్రసంగిస్తూ, విముక్త ఆసియా ఆఫ్రికా దేశాలను "రాజకీయ శూన్యత"తో కూడినవని పేర్కొన్నారు.

కాబట్టి "శూన్యత"ను గూర్చి మాట్లాడడం, ప్రాచ్య ప్రజలు తమ భవిష్యత్తుకు తామే యజమానులవడానికి యింకా "పరిపక్వత" చెందలేదనీ, వారికి రక్షణ అవసరమనే వలసవాదుల పాత తప్పుడు భావాన్నే స్పష్టంగా ప్రతిబింబిస్తూంది. అమెరికన్ సాయుధ రక్షణను ఆరబ్ దేశాలమీద బలవంతంగా రుద్దడమూ, ఆంగ్లో-ఫ్రెంచి వలస పరిపాలన స్థానంలో ఏకైక అమెరికన్ వలసవిధానాన్ని నెలకొల్పడమూ "ఐసెన్ హోవర్ సూత్రం" యొక్క లక్ష్యంగా వుంది.

విశాల ఆసియా, ఆఫ్రికా భూభాగాలు జయించడానికి వీలుగా వుండే "ఎవరికీ చెందని ప్రాంతాలు"గా పరిగణింపబడిన గత శతాబ్దపు ద్వితీయార్థ భాగంలో వుండే పరిస్థితికి మళ్ళీ ప్రపంచం తిరిగి వచ్చిందని అమెరికన్ నూనె, ఆయుధాల గుత్త వ్యాపారస్థులు వెర్రి కలలు కంటున్నారు. ఇప్పుడు బ్రిటిష్, ఫ్రెంచి వలస సామ్రాజ్యాలు త్వరత్వరగా విచ్ఛిన్నమవుతూండడం చూసి అమెరికన్ సామ్రాజ్యవాద వర్గాలు పాత సామ్రాజ్యాల శిథిలాలపై తమ వలస సామ్రాజ్యాన్ని సృష్టించాయనీ, ఆవిధంగా ప్రాచ్యదేశాల అపారమైన ముడిపదార్థ సంపదలను చేజిక్కించుకునే అవకాశం సంపాదించాలని కలలు కంటున్నారు.

అయితే అరబ్ దేశాలను "రక్షించడం" గురించీ, వాటికి "సైనిక సహాయం" యివ్వడంగురించీ వాటికి చేసిన ప్రతిపాదనలకు అవి సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బులు కావడంలేదు, సరిగదా వాటికి తీవ్రంగా నిరసననూ, బహిరంగంగా ఆగ్రహాన్ని వెల్లడిస్తున్నాయి.

"ఐసెన్‌హోవర్ సూత్రం బ్రిటిష్ సామ్రాజ్యవాదం అనుస రించిన విధానంకంటెకూడా దుష్టవిధానాన్ని సూచిస్తూంది" అని ప్రఖ్యాత ఈజిప్షియన్ రాజకీయ వ్యాఖ్యాత అన్వర్ సాదత్ "అల్ గుమ్ హురియా" వార్తాపత్రికలో వ్రాశాడు. ఈజిప్టునుండి దురాక్ర మణ సేనలు తొలగిపోతున్న సమయంలో, శాంతియుత సహజీవ నానికీ, అంతర్జాతీయ సహకారానికీ అనువగు పరిస్థితులు సృష్టింపబడు తున్న సమయంలో ఐసెన్ హోవర్, మధ్యప్రాచ్య దేశాల వ్యవహారా లలో సాయుధజోక్యానికి హక్కు కోరుతున్నాడని జబ్బుర్ రహమాన్ ఎల్-షర్‌కావీ అనే రచయిత "అల్‌షాబ్" అనే మరొక ఈజిప్షియన్ వార్తా పత్రికలో ఉద్ఘాటించాడు. నాటోకు చెందిన ఆయుధాల నుపయో గించి బ్రిటన్, ఫ్రాంసులు ఈజిప్టుమీద దురాక్రమణ జరిపినప్పుడు ఐసెన్ హోవర్ అటువంటి అధికారాలను కోరలేదు. దురాక్రమణ దారులమీద సంయుక్తంగా పోరాటం సాగించాలని సోవియట్ దేశం చేసిన ప్రతిపాదనను ఆయన త్రోసిపుచ్చారు కూడా.

"ఐసెన్‌హోవర్ సూత్రం" తమ వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడం మాత్రమేకాక, బ్రిటిష్ సామ్రాజ్యవాదం కొత్త దురాక్రమణ ప్రారంభించడానికి, యీసారి ఏమేన్ ప్రజలమీద, ప్రోత్స హించింది కూడానని, యీ "సూత్రం" కర్తలను అరబ్ ప్రజలు కోపో ద్రిక్తులై యిప్పుడు నిందిస్తున్నారంటే న్యాయమే.

"ఐసెన్‌హోవర్ సూత్రం" యొక్క లక్ష్యం మధ్యప్రాచ్య దేశాలను బానిసత్వంలో దించడమేగాని వాటి స్వాతంత్ర్య రక్షణ కాదని అరబ్బులు స్పష్టంగా గ్రహిస్తున్నారు. అమెరికన్ అధ్యక్షుని సందేశం మధ్యప్రాచ్యం నూనె విషయంలో పాశ్చాత్యరాజ్యాల శ్రద్ధాసక్తులగురించి నొక్కిచెబుతూ, ప్రజల స్వయంనిర్ణయాధికారాన్నీ, తమ సహజ సంపదను తమ ఇష్టానుసారం వినియోగించుకునే హక్కునూ ఉపేక్ష్యం చేస్తూందని సిరియన్ అధికారవర్గాలు నిరసించాయి.

ప్రాచ్య ప్రజలకు అమెరికన్ "సహాయం" అన్నది మోసానికీ, బెదరింపుకూ పర్యాయపదమైంది. ఈ సహాయాన్ని పుచ్చుకుంటున్న దేశాల ఆర్థికస్థితిగతులను అది అభివృద్ధి చేయడంలేదు. సరిగదా, టర్కీ, ఇరాన్, పాకిస్తాన్, థాయ్‌లెండ్‌లలో చేస్తున్నట్లుగా వాటిని బలహీన పరుస్తున్నది. మధ్యప్రాచ్యంలో అమెరికన్ సైనిక రక్షణ అమలు జరగాలనే షరతుమీద యివ్వబోయే "సహాయా"న్ని గురించిన తమ కొత్త ప్రతిపాదనద్వారా అమెరికన్ పాలకవర్గాలు మళ్ళీ అరబ్ దేశాలకు డాలర్ సంకెళ్ళు తగిలించడానికీ, వాటిని తమ వలసలుగా మార్చడానికీ ప్రయత్నిస్తున్నాయి.

అయితే అమెరికన్ వలస పెత్తందార్ల పన్నాగాలు పేకమేడల వంటివి. ప్రాచ్యదేశాల విశాల భూభాగాలు ఇప్పుడిక "ఎవరికీ చెందని ప్రాంతాలు" కావు, లేదా, సామ్రాజ్యవాదుల కొత్త పరిభాషలో చెప్పా లంటే "అధికార శూన్యత" గల ప్రాంతాలుకావు. తమ రక్తంతో, ఘర్మజలంతో తమ దేశాన్ని భాగ్యవంతం చేసుకున్న లక్షలాది ప్రజల కృషిద్వారా యీ "శూన్యత" జయప్రదంగా భర్తీ చేయబడుతూంది. పూర్తిగా భర్తీ చేయబడుతుంది. ఇతర ప్రజల ఆస్తులను కోరేవారు దీనిని జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రాచ్యదేశాల స్వాతంత్ర్యం మీద ఎటు వంటి దాడి జరిగినా, సకల ప్రపంచ శాంతికాముక ప్రజలచే బలపర్చ బడుతోన్న విముక్త ప్రజలు తిరిగి చావుదెబ్బ కొడతారు. ఈజిప్టుపై దాడిచేసినప్పుడు సామ్రాజ్యవాదులకు బుద్ధి చెప్పబడింది.

## అణు యుద్ధానికి అమెరికా విదేశ భూభాగాలను ఉపయోగించదలచుకుంది

టాస్ ప్రకటన

అణ్వాయుధ సామగ్రి గలిగిన సైనికదళాలను నిర్మించి, వాటిని యితరదేశాల భూభాగాలమీద వుంచే విషయాన్ని అమెరికన్ అధి కారవర్గాలవారిప్పుడు పరిశీలిస్తున్నారని అమెరికన్ పత్రికలు వ్రాస్తు న్నాయి. పశ్చిమ యూరప్, టర్కీ, ఇరాన్, జపాన్, ఒకినావా దీవులు—యీ ప్రాంతాలలో ఇటువంటి దళాల నుంచవచ్చునని పేర్కొనబడింది. అటువంటి సైనికదళాలను నెలకొల్పే విషయం శాసనసభకు అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ యిచ్చిన బడ్జెట్ సందేశంలో కూడా పేర్కొనబడిందని పత్రికలు వ్రాశాయి. ఈ బడ్జెట్ సందేశం, అమెరికన్ ప్రభుత్వం యీవిషయానికి గొప్ప ప్రాముఖ్యత నిస్తూందని నొక్కిచెబుతూంది.

ఆ విధంగా, అమెరికన్ ప్రభుత్వం, అమెరికన్ సైనిక స్థావ రాలను కలిగివున్న విదేశ భూభాలను అణుయుద్ధ సన్నాహానికి ఉప యోగించ దలచుకుంది. అంటే అమెరికన్ ప్రభుత్వం తన ఉద్దేశా లను మరుగుపర్చడం యిక సాధ్యంకాదని భావిస్తూంది.

ఈ చర్యను, ఏదైనా దురాక్రమణ జరిగితే దానికి వ్యతిరేకంగా తీసుకునే చర్యగా చిత్రించడంద్వారా అమెరికన్ ప్రభుత్వం అమెరికన్ ప్రజలనూ, ఇతరదేశాల ప్రజలనూ పెడదారి తొక్కించడానికి ప్రయ త్నిస్తూంది.

అయితే, అమెరికన్ ప్రభుత్వం యిటీవల తీసుకున్న యీ దురాక్రమణ చర్య అర్థమేమిటి? అనే ప్రశ్న బయలుదేరుతూంది.

అమెరికన్ ప్రభుత్వంయొక్క యీ చర్య అణుయుద్ధ ప్రమా దాన్ని తీవ్రం చేస్తూందన్నది నిస్సందేహం. అమెరికన్ అభివృద్ధి విరోధకవర్గాలు అణుయుద్ధాన్ని జరిపినట్లయితే రాగల ప్రతీకారపుదెబ్బ ప్రధానంగా అమెరికామీద పడకుండా మళ్లించడానికీ, ఆ విధంగా, అణ్వాయుధ సామగ్రితోకూడిన అమెరికన్ సైనికదళాలున్న బ్రిటన్, ఫ్రాంసు, పశ్చిమ జర్మనీ, ఇటలీ, టర్కీ, ఇరాన్, జపాన్ తదితర దేశాలకు చెందిన ప్రజలనే ప్రధానంగా ప్రతీకార అణుయుద్ధపు దెబ్బకు ఎరగా చేయడానికీ యీ చర్య ఉద్దేశింపబడిందని కూడా ఎవరైనా గమనించకుండా వుండలేరు.

పైన తెల్పిన అమెరికన్ పత్రికా వార్తల దృష్ట్యా, అమెరికా అణుయుద్ధ సన్నాహానికి తన పథకాలలోకి యిరికిస్తున్న ఆ దేశాల ప్రజలు, యీ అమెరికన్ దురాక్రమణ పథకాలు అమలు జరగడం అతి తీవ్ర దుష్పరిణామాలకు దారితీయగలదని గుర్తిస్తారనీ, వారు యీ దురాక్రమణ పథకాలను పట్టుదలగా వ్యతిరేకిస్తారనే నమ్మకాన్ని సోవి యట్ దేశ ప్రముఖవర్గాలవారు వెల్లడిస్తున్నారు.

ఈ పథకాలు అమలు జరగడంవల్ల సంభవించగల దుష్పరిణా మాలకు బాధ్యత ఒక్క అమెరికన్ ప్రభుత్వానిదే కాకుండా, అణు యుద్ధ సన్నాహానికి స్థావరాలుగా తమదేశ భూభాగాలు వినియోగింప బడడానికి సమ్మతించే ప్రభుత్వాలది కూడా అవుతుందని వేరే చెప్ప నవసరం లేదు.



# ఏకపాత్రాభినయకారుడు సురేన్ కొచరిన్



ఎరేవాన్ సంగీత సభా ప్రదర్శనమందిరంలో చీమ చిటుక్కుమన్నా వినిపించే అంత నిశ్శబ్దంగా వుంది. వినిపించేదల్లా ఏకపాత్రాభినయకారుడు కర్ణపేయంగా ఉచ్ఛరిస్తోన్న గ్రీకుభాషాపదజాలంమాత్రమే . ఆర్మీనియా రిపబ్లిక్ ప్రజాకళావేత్త, ప్రఖ్యాత ఏక పాత్రాభినయ కారుడు అయిన సురేన్ కొచరిన్ "ఒడెస్సే"ను యీ విధంగా ప్రారంభిస్తారు.

అతి ప్రాచీనమైన మహత్తర సాహితీ ఖండాలలో ఒకటి "ఒడెస్సే"; పురాతన గ్రీకుకవితలోని గొప్ప ఉత్కృష్ట రచన యిది, మూడువేల సంవత్సరాలుగా యిది సంస్కృతీ పిపాసమైన మానవాళికి సమ్మోదాన్ని చేకూర్చింది. ట్రోజన్ యుద్ధవీరుడైన ఒడెస్సెస్ సంచారాలకు సంబంధించిన యీ కథ, మానవ శక్తిలో గాఢ విశ్వాసభరితమైనది; మానవుడు కష్టాలను సమర్థతతో ఎదుర్కొని, అధైర్యపడిపోకుండా అతికష్టమైన నిరోధాలను అధిగమిస్తూ పోగలడన్న గాఢవిశ్వాసాన్ని కలిగిస్తుందిది.



కొచరిన్ సృజనాత్మక కృషిలో చరిత్రకారుని, భాషా శాస్త్రజ్ఞుని, రచయిత, నిర్మాత, ఏకపాత్రాభినయకారుల, కృషి సర్వదా సమ్మిళితమై వుంటుంది. ప్రతిభా భాసితమైన ఆయన చాలా ప్రదర్శనలు సోవియట్ శ్రోతలకు ఉత్తమ ఆర్మీనియన్ కావ్యాలను, షహ్రజాద్ డికెమరాన్ కథలనూ, షేక్స్పియర్, టాల్స్టాయ్ కావ్యాలనూ పరిచయం గావించాయి.

మా ఛాయా చిత్రగ్రాహకుడు యస్. షింగరేవ్, సురేన్ కొచరిన్ ప్రదర్శనకు వెళ్ళి, మా సంపాదకీయ కార్యాలయానికి యీ ఛాయాచిత్రాలను తీసుకవచ్చారు.









జపరోజ్ స్తాల్ కర్మాగారంలో భారత ఇంజనీర్.
పాఠశాల, విశ్వవిద్యాలయాల అధ్యయనం ముగిశాక, మళ్లీ ఒక రష్యన్
పాఠం నేర్చుకుంటూ బోర్డుదగ్గ రున్నాడు (ఎడమను)



"డామినోస్" ఆట ఆడటం భారత ఇంజనీర్లకు సంప్రదాయం కాదు. కాని
ప్లాంటువద్దర రోజంతా నిర్విరామంగా పనిచేశాక, కాస్త సరదాకోసం
ఒక ఆట ఆడుతున్నారు (ఎడమను)



సోవియట్ దేశానికి ప్రాక్టికల్ శిక్షణ కోసం వచ్చిన భారతీయ లోహ నిపుణులు "రష్యన్ మిత్రులారా, అభినందనలు" అనే శీర్షికతో రాసిన లేఖనొకదాన్ని, "ద్నెప్రొపెట్రోవ్‌స్కీ మెటలర్జిస్టు" అనే వార్తాపత్రిక వెలువరించింది. ఇక్కడ ఆ లేఖతోబాటు సోవియట్ నగరం జపరోజ్‌లోని భారత లోహ నిపుణుల జీవితాన్ని, కృషిని వివరించే చిత్రాలను యిస్తున్నాము.

* * *

భారత దేశంలో ఒక ఉక్కు కర్మాగారం, అధునాతన యంత్రాలతో సోవియట్ దేశ సహాయంతో నిర్మితమవుతున్నది.

ఈస్టీల్‌ప్లాన్‌టుకు సంబంధించిన నిపుణులం ముప్పైముగ్గురం. ప్రస్తుతం జపరోజ్‌స్తాల్ కర్మాగారంలో ప్రాక్టికల్ ట్రెయినింగ్ పొందుతున్న వాళ్ళం, శీర్షపు అధోభాగాన వాయు పీడన (గ్యాస్ ప్రెషర్) వున్న బ్లాస్టు ఫర్నెస్సుల, ఫ్లక్స్‌డ్ ఎగ్లామరేట్, ఆక్సిజన్ బ్లాస్టుల నడకలో ఎంతో ఆసక్తిని కలిగివున్నాం.

# భారత ఇంజినీ

"జపరోజ్‌స్తాల్" కర్మాగార నిర్వాహకుల సుదీర్ఘమూ, అభ్యుదయదాయకమూ అయిన అనుభవాన్ని, ఇక్కడి నవీన యాంత్రిక విధానాలను మేము ఆకళింపు చేసుకొని క్షైవశం చేసుకొనేందుకు, ఇక్కడి ప్రతి కార్మికుడు. ప్రతి ఇంజనీరు మాకు ఎంతో చేయూత నిస్తున్నారు.

సోవియట్ లోహ కార్మికులు పొందిన ఉన్నత సాంకేతిక విపుల పరిజ్ఞానాన్ని అధ్యయనం చెయ్యాలన్న మా దీక్ష, పైవిధంగా మాపట్ల ప్రత్యేక లక్ష్యం యిస్తున్నందున దృఢతరమవుతున్నది.

యంత్రాలను నడిపేవారు, బాగుచేసేవారూ తమతమ పనులు ఎంత ప్రేమతో, ఎంత దీక్షతో నిర్వహిస్తుం

నృత్య ప్రదర్శనానంతరం, యువబృంద నృత్య ప్రదర్శకులు, ప్రదర్శన శాలలోకి వచ్చినప్పుడు, ప్రేక్షకులందరు తమ హర్షామోదాలను ప్రశంసా సూచకంగా ప్రకటించడానికి ఉత్సహిస్తున్నారు. బాలిక తాన్యా గ్రిగోర్యేవా, త్వరలో భారత ఇంజనీర్లతో స్నేహం కలుపుకొన్నది (ఎడమను)



# రాసిన లేఖ

టారో చూస్తున్నప్పుడు, మాకు ఆశ్చర్యం కలుగుతున్నది. "జపరోజ్‌స్తాల్" వంటి ఉన్నత కర్మాగారంలో శిక్షణ పొందడమనే యీ అంశం, మాకెంతో గర్వకారణంగా వుంది. రష్యన్ మిత్రుల సౌజన్య సహకారాలకు మేము సర్వదా కృతజ్ఞులం.

సోవియట్ భారత దేశాల మైత్రి చిరస్థాయి యగుగాక!

కె. సి. కన్నా
భరత ఇంజినీర్

---

లోహం ద్రవీకరించనున్నది త్వరలో. జపరోజ్‌స్తాల్ స్టీల్-మేకర్ గ్రిగరీ పొమ్యాతున్, భారత ఇంజనీర్ బి. సి. బనోపాధ్యాయ ద్రవీకరణను జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు (పైన)

జపరోజ్ ఇనుము ఉక్కు కర్మాగారం కార్మికుల పిల్లలు ప్రదర్శించిన ఉద్రిక్త ఉక్రేనియన్ "గోపక్" నృత్యాన్ని ప్రేక్షకులు సముల్లాసంగా సందర్శించారు (దిగువ)



క్రీడా విన్యాసాలు

మాస్కో 37 క్రొపొత్కిన్ వీధి. యిది జరుగనున్న యువజనోత్సవానికి, ఆరవ ప్రపంచయువ జన విద్యార్థి ఉత్స వాల సోవియట్ సన్నాహ సంఘానికీ ప్రధాన కార్యాలయం పైవిలాసం.

రొమెనోవ్‌స్కీ యిలా చెప్పారు: "జరుగబోయే ఉత్స వం, జరిగిన ఉత్స వాలన్నిటికంటె గొప్పగా వుంటుంది. శాంతి, స్నేహం, ఐక్యత అన్న భావం యువజనులలో అధికతరంగా ఆదరాన్ని పొందుతోంది; మాస్కోకు 140 దేశాలనుండి ప్రతినిధులు వస్తారు. వారు రావడానికి ముందర హోటల్స్‌లోనూ, హాస్టల్సులోనూ వారికి మేము వసతులను ఏర్పాటు చెయ్యవలసివుంది. దుబాసీలను తీసుకురావలసి వుంది, మాస్కో చౌకులనూ, వీధులనూ అలంకరించ వలసి వుంటుంది. దేశం అంతటా నగరాలలోనూ, మండలాలలోనూ, రిపబ్లిక్కులలోనూ యువజనులకు ఒక లక్ష యిరవై వేల యాత్రిక పత్రాలను మేము పంచి యివ్వవలసి వుంటుందికూడా.

సన్నాహ సంఘానికి రోజూ ఎన్నో ఉత్తరాలు వస్తాయి. అవి ప్రతిచోటునుండీ వస్తాయి. అవి అన్ని విషయాలను ప్రస్తావిస్తాయి. ఉత్సవ కార్యక్రమం ఏమిటి? కళాప్రదర్శనల పోటీలలో ప్రవేశించడానికి షరతులేమిటి? ఈజిప్షియన్ దుస్తులు, భారతీయ దుస్తులు యింటివద్ద తయారు చేయడమెలాగు–అని తెలుపమనీ, లేదా తాము సాయంచేస్తామనీ ఆ ఉత్తరాలలో వుంటుంది.

మాస్కో పురవాసులు తరచు సన్నాహ సంఘానికి స్వయంగా వస్తారు. ఇంగ్లీషు, జర్మన్ భాషలు బాగా తెలిసివున్న, ఉత్తర ప్రత్యుత్తర విద్యా విద్యార్థినియైన ఒక యువతి అనువాదశాఖకు పంపబడింది. అక్కడ ఆమెపేరు, పైవిలాసమూ నమోదు చేయబడ్డాయి, అవసరమైతే ఆమె నాహ్వానించేందుకు. ఒక యువకుడు ఒక ఆకర్షణీయమైన హంశాన్ని ఆలోచించాడు. ఉత్సవంలో ఒక రోజునగానీ, ఒక సాయంత్రంపూట గానీ దానిని ఉపయోగించడానికి వీలుంటుందేమో అతను తెలియజెయ్యమన్నాడు. కార్యక్రమశాఖ ప్రతి సహకార సూచననూ, సలహానూ బాగా ఆలోచిస్తుంది. యువజనుల సలహా ననుసరించి చాలా సమావేశాలూ, వివిధ విషయాలపై సభలూ, యాత్రలూ ఉత్సవ కార్యక్రమంలో చేర్చబడ్డాయి. కార్యక్రమం అద్భుతంగా వుంటుంది—వాస్తవంగా.

ఈ పెద్ద యువజనోత్సవం ఒక దేవతా కథలా వుంటుంది. ఉత్సవం ఊరేగింపు సొకొల్నికిలో మొదలయి, గోర్కీ కేంద్ర ఉద్యానవనంలో ముగుస్తుంది. మాస్కోనది ఉత్సవంలో యువజనులను ఆశ్చర్యపరిచే విషయాలు చాలా జరుగుతాయి. ప్రేక్షకుల కనుల ఎదుట ఒక పెద్ద నౌకా సమూహం కదలిపోయింది, పొగటడలతో మొదలుకొని, తెప్పలూ, నావలతో ముగుస్తూ. ప్రఖ్యాతమైన "కోన్-తికీ" అన్న బల్లకట్టు యీ ఊరేగింపులో వుంటుంది. జలక్రీడలపోటీలు సమాప్తం అయ్యాక, ఆకాశంమీదికి నక్షత్రాలు వచ్చాక మాస్కోనది ఒక అద్భుతమైన ప్రదర్శనం అయిపోతుంది. కొత్తరంగం స్థలాల మీద–అంటే పెద్ద పడవలపైనీ, పొగటడలపైనీ–ఉత్సవ ప్రదర్శనాలు

# 140 దేశాలనుండి ప్రతినిధుల రాక




## 6వ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవం జులై 28, 1957న మాస్కోలో ప్రారంభమవుతుంది!

ఆరవ యువజన, విద్యార్థి మహోత్సవం ప్రారంభం కానున్న 1957 జులై 28వ తేదీ [illegible] ... [illegible] పూలదండలతోనూ, జండాలతోనూ అలంకరింపబడిన [illegible] వ్యవసాయ ప్రదర్శనం [illegible] చౌకునుండి బయలుదేరుతాయి [illegible] —మాస్కో యువజనోత్సవంకోసం (యీ ఉత్సవం యిప్పుడు సాంప్రదాయమై పోయింది) [illegible] నుండి వచ్చిన [illegible] యువతీయువకులు, యీ పండగ [illegible] వెళ్తున్నారు. వివిధ [illegible] ఊరేగింపు [illegible] క్రమణిక ప్రకారం [illegible] ఉత్తర, దక్షిణ [illegible] దరికీ శాంతి స్నేహాలూ [illegible] అభివంద నాలూ పెద్ద పెట్టున కురిపిస్తూవుండగా [illegible]

ఇప్పుడు ప్రతినిధివర్గాలకు వెనుకనున్న పతాకాలు రెపరెపలాడుతున్నాయి. ఉత్సవం జెండా ఎగురవేయబడింది. మాస్కో వేసవి నీలాకాశం కొంతసేపు మాటుపడింది—తెలియాడే కపోతాలతో గగనం తెల్లబారింది. ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి ఉత్సవం మొదలైంది.

మొదలవుతాయి.

ఒక సర్కసు, వలసదేశాల యువజనులతో ఐక్యతా సభ, ఒక గ్రామీణ యువ జనోత్సవం, బాలికల ఉత్సవం, వైజ్ఞానిక కల్పనా కథా సారస్వతసభ, రచయితల—కళాకారుల సభ, క్రెమ్లిన్లో విందు, విద్యార్థి సభలు, ప్రఖ్యాతుల జీవితానికీ,కృషికీ సంబంధించిన సభలూ,ప్రదర్శనాలూ,యాత్రలూ, ఉత్సవ కార్యక్రమంలో ఇవీ, యింకెన్నో ఉంటాయి. ఒక్క ప్రదర్శనలే వెయ్యివుంటాయి.



ప్రతినిధివర్గాల ఊరేగింపు ప్రారంభమయ్యే
స్మొలెన్స్కాయా స్క్వేర్

సోవియట్ ఒలింపిక్స్ కమిటీ యీ వుత్సవ సమయంలో, మూడవ అంతర్జాతీయ యువజన క్రీడలను జరుపుతుంది. దీనిలో సుమారు నాలుగువేలమంది, ప్రపంచంలోని అత్యంత బలశాలురైన క్రీడాకారులు పాల్గొంటారు.

ఉత్సవకాలంలో ప్రతిగంట, అనేక సంఘటనలతో నిండి వుంటుంది. సన్నాహ సంఘం ఒకొక్క ఉత్సవ దినానికీ, యిప్పటికే ఒక చిత్తు కార్యక్రమాన్ని తయారుచేసింది. ఉత్సవంలో తొమ్మిదవ దినమైన ఆగస్టు 6వ తేదీ కార్యక్రమాన్ని ఒకసారి చూదాం. ఆరోజు కార్యక్రమం యీ విధంగా వుంది: యువకర్షకుల సభ, శ్రామికుల పండగ, వైజ్ఞానిక కథాసారస్వతసభ, హెన్రీ ఫీల్డింగ్ 250 జన్మ దినోత్సవ సభ (సోవియట్ యువజనసంఘంతో కలసి బ్రిటిష్ ప్రతినిధివర్గం దీనిని ఏర్పాటు చేస్తుంది), ప్రతినిధివర్గాల సమావేశాలూ, యూనియన్ రిపబ్లిక్కుల ప్రతినిధివర్గాలతోనూ, మాస్కో జిల్లాల, మాస్కో మండల యువజనులతోనూ సమావేశాలు. ఆ రోజున కర్మాగారాలలో పనిచేసే కార్మిక యువకులు పారిస్ కమ్యూన్ ఫాక్టరీలో సమావేశమవుతారు; తత్త్వశాస్త్ర విద్యార్థుల సమావేశం ప్రారంభమవుతుంది; ఐదు ఖండాల అంతర్జాతీయ ప్రదర్శనం జరుగుతుంది; ఇంకా యిటువంటివి ఎన్నో. అన్ని ప్రదర్శనలకూ, సభలకూ ఒకేరోజున వెళ్ళడం అసాధ్యం. ఉత్సవానికి వచ్చే ప్రతిఒక్క ప్రతినిధీ, ప్రతిఒక్కరూ సాధ్యమైనన్నివాటికి వెళ్దామని అనుకోవడం సహజమే గాబట్టి, సోవియట్ సన్నాహ సంఘం ప్రేక్షకుల కాలాన్ని వృధాకాకుండా చేయడానికి యిప్పటికే ప్రయత్నం మొదలుపెట్టింది. మ్యునిసిపల్ రవాణా సౌకర్యాలేకాకుండా వారికి 1300 బస్సులూ, 500 మోటారుకార్లు, మాస్కో గురించి ఉత్సవ కార్యక్రమం గురించి బాగా తెలిసివున్న అనేకవేలమంది. దుబాసులూ, కాలం వృధాకాకుండా నగరంలో తిరగడానికి అతిథులకు సాయపడతారు.

యువజనోత్సవాల సాంప్రదాయానుసారంగా, మాస్కోలో ఒక స్నేహ ఉద్యానవనం నాటబడుతుంది. ఉత్సవంలో పాల్గొనే ప్రతిఒక్కరూ దీనిలో ఒక చెట్టును నాటుతారు. యువజనోత్సవం సమాప్తమై, విదేశీ అతిథులు స్వదేశాలకు మరలివెళ్ళేక, మాస్కోలో యువజనుల ఐక్యతకు జ్ఞాపక చిహ్నంగా ఐదు ఖండాల స్నేహ ఉద్యానవనంలోని మొక్కలు మర్మరధ్వనులు చేస్తాయి. తెలుపు, పసుపు, నపురంగులుల యీ యువజనుల హస్తాలే, ప్రపంచ భవిష్యత్తుకు చిహ్నం,



# ఆల్తాయ్ పర్వతాలలో



ఆల్తాయ్ మండలంలోని ఒజూర్గా క్షేత్ర దృశ్యం



భూగోళపటంలో ఆసియా ఖండకేంద్రాన్ని కనుగొనడానికి ప్రయత్నించినట్టయితే, రష్యన్ సమాఖ్య, సోవియట్ కజకస్తాన్, చైనా, మంగోలియాల సరిహద్దులు కలసిపోయినచోటుకు దగ్గరగా ఒక తావును బహుశా మీరు చూపుతారు. ఇక్కడ, ఆల్తాయ్ అని పిలువబడే యీ కొండప్రాంతంలో మా ఛాయా చిత్రగ్రాహకుడు ఎ. స్యురికిన్ కొన్ని ఛాయా చిత్రాలను తీశారు. వాటిని యీ పుటలలో యిస్తున్నాము.

ఆల్తాయ్ మండలాన్ని పుష్కలంగా ముడి పదార్థాలు గల ఉన్నత పర్వతాలూ, కొండలపైనున్న పచ్చికబయళ్లూ అలముకొని వున్నాయి. దీనిలో తీవ్రంగా ప్రవహించే నదులూ, జలపాతాలూ ఎన్నో వున్నాయి. ఆల్తాయ్ ప్రకృతి ఎంతో అందమైనది. ఆ మండలంలోని అతి సుందరమైన ఒకతావులో కతున్ నదీ తీరాన ఒజూర్గా సెటిల్మెంట్ నెలకొల్పబడింది. ఇక్కడ 1929 లో, అక్టోబరు విప్లవానంతరం పన్నెండేళ్ళకు స్థానికులు ఒక పశుప్రజనన సమిష్టి క్షేత్రాన్ని స్థాపించుకున్నారు. 1917 అక్టోబరులో జరిగిన చరిత్రాత్మకఘటన స్మృత్యర్థం దీనికి "అక్టోబరు ద్వాదశ సంవత్సరాలు" అని నామకరణం జరిగింది. ఈ ఘటన ఆల్తాయ్ శ్రామికులను ధనికరైతుల, షమాన్ల దోపిడీ నుండి, రష్యన్ జారిస్టు అధికారుల నిరంకుశ పాలననుండి విముక్తికి బాటను వేసింది.

ఆల్తాయ్ ప్రజల జీవితంలో జరిగిన అద్భుత పరివర్తనల గాథను కొద్ది మాటలలో వివరించడం అసాధ్యం. వీరు సంఖ్యలో కొద్ది, గత శతాబ్దాలలో దారిద్ర్య అజ్ఞానాలలో జీవించారు. ఒక్క అక్షరాస్యుడూ లేని యీ ప్రజల గృహాలలో అక్టోబరువిప్లవం సంస్కృతీ, జ్ఞాన

సమిష్టి క్షేత్ర పశుపాలకులు, వసంతం, వేసంగి, ఆకురాలుకాలాలలో ఎత్తైన పర్వత ప్రదేశాలలో పశువుల్ని మేపుతుంటారు







కతూన్ నది సుందర తీరాన నిర్మితమైన ఒజుర్గా క్షేత్రం (పైన)

సమిష్టిక్షేత్ర కృషీవలులు. తమ సమిష్టి క్షేత్రపు పండ్లతోటలలో సమృద్ధంగా పండిస్తారు, పండ్లు



# సమిష్టి క్షేత్రం

జ్యోతులను వెలిగించింది.

ఆల్తాయ్ ప్రజలు, తమ పూర్వులవలె సంచార జాతుల దరిద్రపుగుడారాలలో ఇప్పుడు నివసించడం లేదు. నేడు ఒజుర్గా సమిష్టి రైతుల యిళ్లు, ఆల్తాయ్‌లోని యితర గ్రామ వాసుల యిళ్లూ కలపతోగాని, యిటుకలతోగాని కట్టబడినటువంటివి. వారి యిళ్లు వెచ్చగా, అందంగా వుంటాయి. వాటిలో విద్యుద్దీపాలున్నాయి.

ఒజుర్గా సమిష్టిరైతుల ముఖ్యవృత్తి, పశు ప్రజననం. "అక్టోబరు ద్వాదశ సంవత్సరాల" సమిష్టిక్షేత్రం, చక్కని గుర్రాలకూ, పాల గోవులకూ ప్రసిద్ధికెక్కింది. దానికి ఒక రెయిన్‌డీర్ ప్రజననశాఖకూడా వుంది. రెయిన్









డీర్ కొమ్ములతో ఒక విలువైన మందు తయారు చేయబడుతుంది. కాని యిక్కడ పశుపోషణలోని ఒక ముఖ్యశాఖ, చక్కని ఉన్ని నిచ్చే గొర్రెల ప్రజననం. ఈ జాతిని తయారుచేయడానికి చాలా కృషి చేయవలసి వచ్చింది. దీనికి వెచ్చని వాతావరణం అంటే చాలా యిష్టం. అయినా ఆల్టాయ్ లోని తీవ్రమైన పర్వత పరిస్థితులకు అలవాటు పడిపోయింది. ఈ కృషిలో ప్రజననకారులు యెంతగా విజయాన్ని సాధించినదీ, దిగువ చిత్రం తెలియజేస్తుంది.

కాని సమిష్టి రైతులు పూర్తిగా పశుపోషణలోనే నిమగ్నులై లేరు. ఆల్టాయ్ వాతావరణంలో తరచు తీవ్రమైన మార్పులు వచ్చినప్పటికీ, వారు గొప్పనాణ్యమైన ఆపిలు. బెర్రీపళ్ళను పెంచుతారు; తేనెటీగలను పెంచుతారు. ఆల్టాయ్ ప్రజలలో, ఏకాకులుగా యెలుగుబంటులను నేర్పుతో వేటాడే ప్రవీణులైన వేటగాళ్ళు చాలా మంది వున్నారు.

వృద్ధుడైన రైన్‌డీర్ ప్రజననకారుడు యెగోర్ కజెన్‌త్సేవ్ చేతిలో దుప్పి కొమ్ములతో (పైన)

★

క్షీరక్షేత్రంలో షురా షర్పోవా, ప్రొద్దున పితికినపాలను కొలుస్తూ (మధ్య:)

★

వేటకాడు తొఖ్నా కిప్చకోవిచ్, తను వేటాడిన ఎలుగుబంటి తోలుతో (దిగువ)

క్లావ్దియా ఆర్బంచ్కోవా, సమిష్టి
క్షేత్ర పశు పాలకురాలు





ఒజుర్గ్ గ్రామసామీప్యంలో ఉరవడిగా
ప్రవహించే కతున్ నది సుందరదృశ్యం

# సోవియట్ యాత్రికుని దృష్టిలో భారత దేశం

★ డి. షాలోమోవిచ్ ★

మేము యెంతో కాంక్షిస్తూ వచ్చిన విషయం సాధింపబడింది భారత దేశానికి చేసుకొన్న మొట్టమొదటి యాత్రికుల జట్టు మాదే.

ఇక్కడ అనేక అద్భుతమయిన విషయాలున్నాయి. అవి మా స్మృతిపథంలో చాలాకాలం నిలచివుంటాయి. ఆశ్చర్యాన్ని కలిగించే రంగుల వైవిధ్యము. నగర ప్రజల యొక్క



సోవియట్ యాత్రికుల జట్టు ఒకటి కె. పి. బెర్జీ అను ఒక కలకత్తా పౌరునితో ఇష్టాగోష్ఠి జరుపుతుండడాన్ని చూడవచ్చును. ఈతడు మాస్కోకు మొట్టమొదటి భారతీయ యాత్రికుల జట్టులో వెళ్ళివచ్చాడు. "నా హృదయంలో సగం మాస్కోలోనేవున్నది. ఎందుకంటే మాస్కో వాసుల్లో అనేకమంది నామిత్రులు. స్పార్తక్ ఫుట్‌బాల్‌క్లబ్‌కు నేను అభిమానిని కూడాను".



బొంబాయిలోని ఒక మోటారు వర్క్సులో, పనిచేసే ఇల్యాస్ మలింద్రా, మైకేల్ పీటర్ అస్సీ అను ఇద్దరు యువకులను చూడవచ్చును. వారితో తమకు కలిగిన పరిచయానికి ఒక జ్ఞాపక చిహ్నంగా మా యాత్రికులు వారిచొక్కాలకు బాడ్జిలనుతగిలించారు(పైన)

★

కంఠస్వరాల విభిన్నస్థాయిలు, ఆధునిక పట్టణాల్లోని సందడికీ, ప్రాచీనకాలానికి మధ్య సమన్వయత, అన్నిటికంటే ముఖ్యముగా భారతీయ ప్రజలు—ఇవి కలకాలం గుర్తుంటాయి. భారతీయులు తమ వృత్తితోగాని, వారికి జీవితంలో గల స్థానంతోగాని ప్రమేయం లేకుండా అందరూ తమ ఆత్మ గౌరవాన్ని కాపాడుకొంటారనీ, వీరా



బొంబాయిలోని మెరీన్ డ్రైవ్‌లో కూర్చొని పిచ్చాపాటి మాట్లాడుతున్న ఇద్దరు ముస్లిం పెద్దమనుష్యులను చూడవచ్చును. ఒక అపరిచితుడు కెమేరాతో అంత దగ్గరగా వచ్చినాగూడా ప్రశాంతంగా కొనసాగుతున్న వారి సంభాషణకు అంతరాయం కలుగలేదు. (ఎడమ)



పాతఢిల్లీలోని చాందినీచౌక్‌లో, ఈ తిను బండారాలను వీధిలో అమ్ముకొంటున్న దృశ్యాన్ని చూస్తుంటే మాస్కో వాసులకు వింతగా వుంటుంది. అతని ఇల్లు గూడా అక్కడే ఉన్నది. తినుబండారాలను అక్కడే తయారు చేస్తుంటాడు. (కుడి)





డంబరంగా ఉంటూ అందరితో కలసిమెలసి వుంటారనీ వారిని చూచినవారికి అనుపిస్తుంది.

వృత్తి మూలంగా "ఛాయాచిత్ర విలేఖరిని" కావడం మూలంగా నేను అక్కడ చూచిన వాటిని ఛాయాచిత్రాలద్వారా పరిగ్రహించాను. వందలకొలది ఛాయాచిత్రాలను తీసాను. వాటిలో కొన్ని ఇక్కడ ముద్రింపబడ్డాయి.

భారతదేశాన్నుండి తిరిగివస్తూ మేము భారతదేశ వివిధ ప్రజలతో కలిగిన పరిచయపు మధురస్మృతులను వెంట తెచ్చుకొన్నాము. అవి అనేక సంవత్సరాలవరకు మా స్మృతిపథంలో నిలచివుంటాయి.





జయపూర్‌లో మేము"అద్భుతమైన వాస్తుశిల్ప కళాఖండాలను చూచాము. ముఖ్యంగా"హవామహల్"మమ్మల్ని బాగా ఆకర్షించింది.అదంతా లతలలోనే గాని, రాతితో కట్టలేదేమో ననిపించింది మాకు. ఈ వాస్తు శిల్పసృష్టి నిరాడంబరమైన శిల్పంతో గొప్పగా వున్నది. (ఎడమను పైన)

వ్యాపారం జరుగుతున్న ఒకచోట ఒక చిన్న మేదరి సామను వ్యాపారస్థుని ఛాయాచిత్రం తీసాను. ఈ ఛాయాచిత్రం తీస్తుంటే అసలు ఈ విషయాన్ని పట్టించుకొనే పట్టించుకోకుండా ఎటోచూస్తున్నాడు (ఎడమ దిగువ).





| స్థానిక కళాశాలకు చెందిన ఒక విద్యార్థుల జట్టు మాకు రాజస్థాన జానపదనృత్యాలు చేసి చూపించారు. వారు నృత్యం చేసిన తర్వాత నేను ఈ ఛాయాచిత్రాన్ని తీసాను. ఈ చిత్రములో వున్నవారు, ఎడమనుండి కుడికి చంద్రకళావర్మ, బన్సీధర్ వర్మ, శకుంతల వర్మ.

భారతదేశంలో ఉత్తరాన వున్న కాశ్మీర్‌ను మేము సందర్శించాము. ఇక్కడకూడా బహుస్ఫుర ద్రూపులైన స్థానిక ప్రజలు మమ్మల్ని యెంతిగానో ఆకర్షించారు. నా మనస్సు ఊరుకొనదట్టక ఒకటి తర్వాత ఒకటిగా గొర్లకాపర్లవి రెండు చిత్రాలు తీసాను. కొండ





దారుల్లొంచి పోతుండగా వీరు మాకు కనబడ్డారు. అమాయకమైన చూపులతో యెంతో హుందాగా నిలబడివున్న వీరి నిద్దరిని చూస్తుంటే నాకు ఈనాటికిగూడా యెంతో ఆనందంగా ఉన్నది.



కాశ్మీర్ రాజధాని శ్రీనగర్‌లో నేను వార్తాపత్రికలమ్మే ఒక దుకాణం దగ్గర యీ ఛాయాచిత్రాన్ని తీసాను. అప్పుడే వచ్చిన వార్తాపత్రికలను, మాగజైన్లను యువకులు యెంతో ఉత్సాహంగా కొనుక్కొని పోతున్నారు.







త్రిలకాలంగా ప్రసిద్ధిగాంచిన త్రోయిత్సా — సెర్గియేవ్ మఠం మాస్కోకు సమీపంలో గోర్కీ నగరానికి పోయే రోడ్డుదరిని వున్నది.

ఆ మఠం ఉన్న స్థలం జగోర్స్క్‌కు మేము అక్కడ ఉత్సవం జరిగే సెయింట్ సెర్గీ పండుగ నాటికి చేరుకున్నాము.

మాస్కో నుండి మేము బయలు దేరేటప్పటికి ఇంకా చీకటిగానే వున్నది. అంతటి తెల్లవారుజాము వేళకూడా అందంగా దుస్తులు వేసుకొని వున్నవారితో బండి కిటకిటలాడుతున్నది. ఆ జనంలో వినోదయాత్రకు బయలుదేరిన ఒక విద్యార్థుల జట్టుకూడా వున్నది.

ఆకులు రాలిపోయి వున్న కొండరావితోపులు, వాటికి మధ్య మధ్యగా దేవదారు వృక్షాలు ఉషః కాంతిలో వింత వింతగా అగుపడుతూ ఆకురాలు కాలపు రష్యా ప్రకృతిని చాటుతున్నాయి.

జగోర్‌స్క్! అక్కడ నిలబడ్డ జనంలో అనేకులు లోలోన ప్రార్థనలు చేసుకొంటున్నారు. విద్యార్థులు కిటికీల దగ్గర చేరి చూడసాగారు. చిట్టచివరికి యెలాగైతే నేం బండి దిగి బయలుదేరాము. కొండమీద చుట్టూ కోటగోడలు, బురుజులతో కూడివున్న యీ అద్భుతమయిన పట్టణం ఒక

ఉస్పెన్‌స్కీ క్రైస్తవ మఠం (1559-85)
సక్లదెజ్‌నయా క్రైస్తవ ప్రార్థన మందిరం (17వ శతాబ్దం)

# త్రోయిత్సా సెర్గియేవ్ లావ్రా
## చరిత్రకెక్కిన ప్రసిద్ధ మఠం

వి. కుజ్నెత్సోవ్

కొండపైన వున్నది. చర్చీల గోపురాలు సూర్యోదయపు అరుణ కాంతుల్లో బంగారు వన్నెల నీను తున్నాయి.

చిట్టచివరికి మేము మఠంలోనికి చేరుకున్నాము. అక్కడిచర్చిలలోను, చౌకులలోను జనం వేనకువేలు గుమిగూడి వున్నారు. ఇలా వుంటుందని యిదివరకే నేను అనుకొన్నాను: ఈ మఠం స్థాపించిన సెయింట్ సెర్గీ రదొనెజ్కీ-వర్ధంతి యీనాడు, ఆ సందర్భంగా పెద్ద ఉత్సవం జరుగుతుంది.

త్రోయిత్సా—స్జెర్గియేవ్ మఠం అఖిల రష్యాకు ప్రధాన గురువయిన అలెక్సీ నివాసస్థానంగా వుంటున్నది. మాస్కో మత విద్యాపరిషత్తు కేంద్రంగాకూడా వుంటున్నది. ఈ విద్యాపరిషత్తులో 700 మంది యువకులు విద్య నభ్యసిస్తున్నారు. మత గురువులకు సంబంధించిన మరికొన్ని విద్యాసంస్థలకుగూడా యిది కార్యస్థావరంగా వుంటున్నది.

ఉస్పెన్స్కీ చర్చి ద్వారం దగ్గర ప్రజలు పెద్ద పెద్ద గుంపులుగా చేరివున్నారు. లోనుండి బృందగానము, ప్రార్థనలు వినబడుతున్నాయి.

బంగారు విగ్రహాలు వున్నచోట, లతలు చెక్కబడివున్నచోట వంకలాది మైనపువత్తులు వెలుగుతున్నాయి. ఒక ముసలి మతగురువు ప్రార్థనను నడిపిస్తున్నాడు. బంగారు జలతారు దుస్తులను ధరించి వున్నాడు.

జనసమర్ధంగుండా చర్చిలోంచి బయటికి



రావడం యెంతో కష్టమైపోయింది.

"యాత్రికులు" అని వ్రాసివున్న అట్టలు తగిలింపబడిన మోటారుకార్లు బయట బారులు తీర్చి వున్నాయి. విదేశ అతిథులుకూడా అనేకులు ఉత్సవం చూడడానికి వచ్చారు.

1918వ సంవత్సరంలోనే వి. ఐ. లెనిన్, సాంస్కృతిక, చారిత్రక అవశేషాల పరిరక్షణకు ఒక శాసనాన్ని సంతకం చేశారు. అప్పటినుండి యీ మఠానికి సంబంధించిన కట్టడాలన్నీ ప్రభుత్వ పరిరక్షణలో వుంటున్నాయి. కళలు, చరిత్రకు సంబంధించిన లావ్రా మ్యూజియంవారు మఠానికి చెందిన





మఠసందర్శనార్థం మాస్కోనుండి యాత్రికుల రాక (పైన)

★

మఠ ముందరి దృశ్యం (మధ్య)

★

మండపం [1[illegible]8[illegible]–92] దిగువ)

కట్టడాలను పునరుద్ధరించి, మఠానికిచెందిన చరిత్రను పరిశోధిస్తున్నారు.

లావ్రా 700 సంవత్సరాలకు పూర్వమే స్థాపింపబడింది. దీని చరిత్రకూ, రష్యా, రష్యా దేశపు జాతుల చరిత్రకూ అవినాభావ సంబంధంవున్నది. ఈమఠం రష్యాతోపాటే వర్ధిల్లుతూవచ్చింది. తెల్లగోడల ట్రినిటి చర్చి 1423 లో నిర్మింపబడింది. ఈ చర్చిలోని కుడ్యచిత్రాలు, లతలు, ఆంద్రె రుబ్లేవ్ అనే చిత్రకారునిచే చిత్రింప బడ్డాయి.

బ్రహ్మాండమైన ఐదుగోపురాలుగల ఉస్పెన్‌స్కీ చర్చి 1585 లో పూర్తయింది ఈ చర్చిలకు చుట్టు చక్కని గోడ ఒకటి నిర్మింపబడి వున్నది. త్రోయిత్సా-సెర్గియేవ్ లావ్రాకు ఎంతో చరిత్ర వున్నది.

ముఖ్యంగా యీ మఠాధిపతులు పోలిష్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా వీరోచితమైన పోరాటాన్ని జరిపారు. 30,000 మందితో కూడిన స్లియప్త్ సైన్యం యీ మఠాన్ని పదిహేడవ శతాబ్దంలో ముట్టడించినప్పుడు 2,500 మంది సన్యాసులు ఆ చుట్టుపట్ల ఉన్న రైతుల సహాయంతో 16 నెలలపాటు శత్రువును యెదిరించి నిలబడి విజయాన్ని సాధించగలిగారు. మఠం సింహద్వారంపైన పొంగబడి వున్న కంచు ఫలకంమీద యీ విషయం వివరించ బడింది.

తిరిగి అక్కడినుంచి బయలుదేరవలసిన సమయం వచ్చింది. కాని మరొకసారి తిరిగి మఠంవైపు చూడకుండా ఉండలేక పోయాను. రంగురంగుల గోపురాలు ఆకాశాన్నంటుతూ కనబడుతున్నాయి. "శిలలో సంగీతం" అన్నమాట యీ కట్టడానికి అన్నివిధాల వర్తిస్తుంది.

ఇప్పుడు జరుగుతున్న మరమ్మతులు



# సోవియట్ ప్రాచ్య విజయం

[1 వ పేజీ తరువాయి]

ప్రజల్లో అంతర్జాతీయ మైత్రి సరళిని అభ్యసింపజేయడానికి ఇన్ని సంవత్సరాలుగా కమ్యూనిస్టుపార్టీ జరుపుతూవచ్చిన పని గొప్ప ఫలితాలను కలిగించి సోవియట్ ప్రజలమధ్య అభేద్యమైన సోదరప్రేమను స్థాపించడానికి దారితీసింది. సోవియట్ దేశంలోని రష్యన్, తదితర ప్రజల సహాయంతో పూర్వపు అంతగా అభివృద్ధి చెందని సోవియట్ ప్రాచ్య ప్రజలు సాధించిన ఆర్థిక విజయాలు — ఆసియా రిపబ్లిక్‌లను బాగా అభివృద్ధి పొందిన సోవియట్ దేశ యూరోపియన్ విభాగపు రిపబ్లిక్‌ల స్థాయిలోకి తీసుకువస్తున్న యీ విజయాలు — సోవియట్ దేశపుమధ్య విభాగానికి, సరిహద్దు విభాగాలకుమధ్య ఉన్న అసమానపు సంబంధాల పునాదినే పూర్తిగా తుత్తునియలు గావించాయి.

ఆధునిక పురోభివృద్ధికి అనుగుణ్యంగా ప్రాచ్యప్రజలు ముందడుగు వేయడం అసాధ్యమన్న కట్టుకథలను వలసపెత్తందార్లు ఇంకా సృష్టిస్తూనే ఉండడం అందరికీ తెలిసిన విషయమే యూరోపు ఖండంలో అనాగరక ప్రజలు ఒకచోటునుండి మరొకచోటుకు తిరుగుతూవున్న రోజుల్లో, అత్యున్నత సంస్కృతితో వర్ధిల్లిన ఈజిప్ట్ ప్రజలకే వలసపెత్తందారులు యీమధ్య ఇలా చెప్పారు: "మేము లేకపోతే మీరు నిలబడలేరు. మా ఇంజినీర్లు, పైలెట్లు లేకపోయినట్లయితే సూయిజ్ కాలువలాంటి మహావ్యవస్థను నిర్వహించలేరు." మనకాలపు అనాగరికులైన వలసపెత్తందారులు సూయజ్‌కాలువను ఈజిప్ట్‌ప్రజలకు స్వాధీనపర్చడంకంటే దానిని నాశనం చేయడమే మంచిదని తలచారు. ప్రాచ్యదేశాలనుండి కొందరు వలసపెత్తందారులు తరిమివేయబడినప్పుడు వారిలాంటి ఇతరులు ప్రాచ్యంలో "శూన్యస్థితి" యేర్పడిందని గోలపెడుతుంటారు విదేశీ "ప్రబోధకులు" లేకుండానే ఆసియా, ఆఫ్రికా ప్రజలుముందుకు పోగలరనీ, ఈమహాఖండాల ప్రజలు సంపూర్ణంగా శక్తివంతులై ఉంటూ, తమ దేశాల అభివృద్ధిని తామే జరుపుకోవాలని అభిలషిస్తున్నారనీ, దోపిడిదారులు, వలస పెత్తందారుల, మూలంగా అన్నివిధాల కుంటుబడిన అభివృద్ధి గమనాన్ని పెంపొందించాలని ప్రయత్నిస్తున్నారనీ అర్థం చేసుకొని వలచుకోవడం లేదు వారు.

ప్రఖ్యాతిగాంచిన ప్రాచ్యతత్వశాస్త్రవేత్త, ప్రముఖ భారత రాజకీయనాయకుడు అయిన డాక్టర్ రాధాకృష్ణన్ గత సంవత్సరం సోవియట్ దేశంలో పర్యటించినప్పుడు ఉజ్బెక్ రాజధాని అయిన ఆల్మా‌అటాలో మాట్లాడుతూ ఇలా అన్నారు: "ఈ రిపబ్లిక్‌ను సౌభాగ్యవంతమైన ప్రాంతంగా మార్చుటలో మీరు ఒకతరంలో గావించిన యీ పని, ఇతరులందరికీ ఒక ఆదర్శంగా ఉండగలదు."

స్వతంత్రులైన ప్రాచ్యప్రజలు అద్భుతమయిన ఫలితాలను సాధించగలరనడానికి ప్రజల మధ్య మైత్రి, పరస్పర సహకారాలకు దోహదమిచ్చే లెనినిస్టు జాతీయ విధానం విజయవంతమవుతుందనడానికి సోవియట్ ఆసియా రిపబ్లిక్‌లు సాధించిన విజయాలు విస్పష్టమైన తార్కాణాలు కాగలవు.

# లియో టాల్‌స్టాయికి భారతదేశంనుంచి వచ్చిన లేఖలు

**ఎ. షిఫ్‌మన్,**

యల్. యన్. టాల్‌స్టాయ్ ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాల శాస్త్రజ్ఞుడు, మాస్కో

(గత సంచిక తరువాయి)

ఇంతవరకు ప్రచురితము కాని ఉత్తరాల్లో మరొకటి యిస్తున్నాము.

మురాదాబాద్‌కు చెందిన న్యాయవాది నారాయణ బిషణ ఈ ఉత్తరాన్ని వ్రాశాడు. ఆయనకూడా తనదేశ పరిస్థితులను తెలుపుతూ వాపోయాడు. కుపితకంఠంతో వినబడిన జి. డి. కుమార్ లేఖవలె గాక, న్యాయవాది బిషణ వ్రాసిన లేఖలో భారతదేశంపైన టాల్‌స్టాయ్ ఒక ప్రకటనను చేయడానికి సహాయపడగల, భారతదేశానికి సంబంధించిన అనేక వాస్తవ విషయాలు యివ్వబడ్డాయి.

"జనాభాలో మూడింట రెండువంతులు వ్యవసాయంపైననే జీవిస్తారన్న విషయంలో భారతదేశం స్థితి రష్యాస్థితివలెనే వున్నది," అంటూ ఆయన వ్రాశాడు. కాని గ్రామాల్లో నివసించే వ్యవసాయదారుల్లో దాదాపు అందరూ నిరక్షరాస్యులు, అమాయకులు, మూఢనమ్మకాలకు లోనైనవారు, పిరికివారు, వాస్తవవిషయా లేమి తెలియవు. అధికారులకు ఊరకే లొంగిపోతారు. వారు సేద్యంచేసే భూమి బ్రిటిష్ వారిదని భావింపబడుతున్నది. బ్రిటిష్‌వారు భూస్వాములనుండి సిస్తులను వసూలు చేస్తారు. భూస్వాములు తమ రైతులనుండి సంవత్సరానికి కొంత మొత్తాన్ని వసూలు చేస్తుంటారు. సాధారణంగా, పూర్వపు భారతీయ కులీన వంశీయులే భూస్వాములుగా వుంటుంటారు. వారే వడ్డీ వ్యాపారంగూడా చేస్తుంటారు. ఆత్మగౌరవము, స్వాతంత్ర్యేచ్ఛ అన్నవి యే కోశాన లేకుండా వీరు బ్రిటిష్ అధికారులను పొగుడుకొంటూ బ్రతుకుతుంటారు.

"....ప్లేగు, కలరా, మశూచి, చలిజ్వరాలు, తదితర వ్యాధుల వల్ల చావుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ఇంగ్లండులోకంటే యిది రెండింతలు యెక్కువ. శిశుమరణాలుగూడా అత్యధికంగా వున్నాయి....గత 90 సంవత్సరాలనుండి జనాభా మొత్తం ఒకంతగానే వుంటూ వచ్చింది."

ఈ లేఖకుడు, భారతదేశంలో యాభై లక్షల మంది దరిద్రులు వున్నారనీ, బ్రిటిష్‌వారు దేశ ఆర్థిక విధానంలో కీలక స్థానాలను ఆక్రమించుకున్నారనీ, జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడుతున్న వీరులను బ్రిటిష్ అధికారులు క్రూరంగా హింసిస్తున్నారనీ తెలియజేశాడు.

నారాయణ బిషణ తనలేఖను ముగిస్తూ యిలా వ్రాశాడు:

"విదేశీ క్రూర పరిపాలనమూలంగాను, ఆహార వస్తువుల ధరలు అధికమైపోవడం మూలంగాను దేశమంతటా అసంతృప్తి, కలవరము అగుపడుతున్నాయి. కాని యిది నివురుగప్పిన నిప్పులాగ వున్నది."

తమకు సహాయపడమని కోరుతూ టాల్‌స్టాయ్‌కి భారతీయులు వ్రాసిన అనేక ఉత్తరాల్లో ఇవి కొన్నిమాత్రమే. ఇలాంటి ఉత్తరాలు ఒక్క భారతదేశంనుండేగాక చైనా, జపాను, బర్మా, సిలోను, ఈజిప్ట్, తదితర వలసదేశాలు, పరాధీనదేశాలనుండి కూడా వచ్చాయి. వలస పెత్తందార్ల పరిపాలనను పొగుడుతూ, వలసదేశాల్లోని ప్రజలను "నాగరికులను" గావించడానికి జరుపుతున్నపనిని గురించి గానంచేసిన పాశ్చాత్య బూర్జువా ప్రచారకుల పుస్తకాలుగూడా యాస్నయా పొల్యానాకు కుప్పతెప్పలుగా వచ్చి పడుతుండేవి. ప్రాచ్యదేశాలపైన తన అభిప్రాయాన్ని తెలియజేయాలనీ, విదేశీ పరిపాలనక్రింద నానా హింసలు పడుతున్న ప్రజలపట్ల తన సానుభూతిని ప్రకటించాలనీ టాల్‌స్టాయ్ అంతకంతకూ యెక్కువగా అభిలషిస్తూ వచ్చారు. ఆయన యీవాంఛ "హిందూదేశీయునికి ఒకలేఖ" అన్న ప్రఖ్యాత లేఖలో వ్యక్తమయింది. వలస పెత్తందార్ల నిరంకుశ చర్యలు ఈలేఖలో తీవ్రంగా ఖండింపబడ్డాయి.

టాల్‌స్టాయ్ వ్రాసిన "హిందూదేశీయునికి ఒకలేఖ" అన్నలేఖ, తదితర ప్రచారకవ్యాసాలు భారతీయ ప్రజలకు గొప్ప నైతిక బలాన్ని చేకూర్చాయి. ఆయన తన జీవితాంతంవరకు భారతీయ ప్రజలకు మిత్రుడుగా ఉంటూ వచ్చారు. అనేక శతాబ్దాలుగా నిలచివున్న, గొప్ప భారతీయ సంస్కృతిని యెంతగానో మెచ్చుకొనేవారు.



# బాల రైలు

(మా విలేఖరి నుండి)

...."వినండి! వినండి! పైసీర్ జంక్షన్ నుండి పావ్లిక్ మొరొజోవ్ జంక్షన్‌కు వెళ్ళే ఒకటవనెంబరు బండి ఎక్కిన ప్రయాణీకులు వినండి," అంటూ లౌడ్ స్పీకర్‌లోంచి వినబడుతున్నది.

ఈ జంక్షన్లు, రైల్వేలైను యే చిత్రపటంలోను కనబడవు. అయినా అవి అస్తిత్వంలో వున్నాయి. దీనినే దక్షిణ ఉరల్ బాలల రైల్వే లైను అంటారు. ఆరు కిలోమీటర్ల పొడవు మాత్రమే వున్న యీ రైల్వే లైను చిన్నదే కావచ్చు. కాని దీనికిగూడా స్వంత స్టేషన్లు, డిపోలు, రైల్వే ఇంజన్లు, రైల్వేపెట్టెలు వున్నాయి. పెద్దరైల్వేకు ఒక చిన్న నమూనాగా వుంటుందిది.

ఈ రైల్వేలైను కొమ్సొమోల్స్ సభ్యులచేత, చెల్యాబిన్స్క్ రైల్వే పనివారలచేత నిర్మింపబడి బాలలకు స్వాధీనం చేయబడింది. ఈరైల్వేను బాలలు తామే స్వయంగా నడుపుకొంటున్నారు. దీనిలో పనిచేసే స్విచ్ మెన్లు, డిస్పాచర్లు, స్టేషన్‌మాస్టర్లు, కండక్టర్లు, ఇంజనీర్లు—అంతా బాలలే. వీరంతా తమ పాఠశాలలలోను, బాల సంఘాలలోను వున్న "బాల రైల్వే పనివారల" జట్లలో తమతమ వృత్తులలో బాగా ప్రావీణ్యతను పొందారు.

రైల్వే వృత్తులను బాలలు యెంతో ఆనందంతో నేర్చుకొంటున్నారని బాలల రైల్వేలో బోధకుడుగా పని చేస్తున్న పావెల్ ప్రొఖొరోవ్ చెప్పాడు. ఈ రైల్వే అస్తిత్వంలోకి వచ్చిన ఆరుసంవత్సరాలలో "బాల రైల్వే పనివారల" జట్లలో దాదాపు ఐదువేలమంది బాలబాలికలు శిక్షణను పొందారు. వీరంతా రైల్వేకుచెందిన దాదాపు ప్రతి వృత్తిలోను ప్రవేశాన్ని పొందారు. అందువల్ల ప్రతి ఒక్కరూ స్విచ్ మెన్‌గా గాని, డిస్పాచర్‌గా గాని, ఇంజనీరుగా గాని, స్టేషన్‌మాస్టర్‌గా గాని పనిచేయగలరు.

మేము, స్టేషన్‌లోకి ప్రవేశించాము. ఎప్పటిలాగానే, ఈ ఆదివారంకూడా ప్రయాణీకులు యెక్కువగావున్నారు, దక్షిణ ఉరల్‌రైల్వేస్టేషను అన్నివిధాల "నిజమైన". రైల్వేస్టేషన్‌లాగనే వున్నది. దీనికిగూడా ఒక కేషియర్ ఆఫీసు. రేడియో కేంద్రం, వెయిటింగ్ రూము (విశ్రాంతి తీసుకొనే గది) వున్నాయి. కాని ఒక్క బాహ్యరూపంలో మాత్రమే అది నిజమైన రైల్వే స్టేషన్‌లాగ వున్నదనడానికి వీల్లేదు. నిజమైన రైల్వేస్టేషన్‌లలోవలెనే సాంకేతిక ఉపకరణాలు, స్వయంచాలక యంత్రాలు, రైల్వే ఇంజన్లు వున్నాయి. ఒక రేడియో, టెలిగ్రాఫ్ సంబంధాలు వున్నాయి.

స్టేషన్‌కుచెందిన సాంకేతిక గ్రంథాలయంలో బాలలు శ్రద్ధగా చదువుతుండటం మేము గమనించాము. 'బాల రైల్వే పనివారల సమితి' గదిలో కొందరు బాలలు టెలివిషన్ కార్య

వాలోద్యా జాయేవ్, ఇంజన్ డ్రైవర్ సహాయకుడు. ఇంజన్ను ప్రయాణానికి అనువైన ఉత్తమ స్థితిలో వుంచుతున్నాడు

క్రమాన్ని చూస్తున్నారు.

ఆరోజున కొల్యా సిడగోవ్ స్టేషన్‌మాస్టర్‌గా పనిచేస్తున్నాడు. బాధ్యతతో కూడిన పని. తాను ధరిస్తున్న యూనిఫారం అంత ముఖ్యమైన విషయం కాదనీ, రైలుబండ్లను నడిపించే అత్యంత బాధ్యతాయుక్తమైన పనిని తాను నిర్వర్తిస్తుండడమే ముఖ్యమైన విషయమనీ ఆ బాలుడు గ్రహించాడు. అనేక టెలిఫోన్లు ఉన్న టేబులుముందు కూర్చొని బండ్ల రాకపోకల పనిని, బండ్ల షంటింగు పనిని నడిపిస్తున్నాడు. రైల్వే లైను పరిస్థితి యేవిధంగా వున్నది యెప్పటికప్పుడు చూపించే ఒక బోర్డును అక్కడ మేము చూచాము. ఆ సమయంలో కోల్యా ఒక సిగ్నల్ లీవర్‌ను త్రిప్పాడు. బోర్డుమీద వున్న ఒక చిన్న ఎర్రదీపం ఆరిపోయి ఆకుపచ్చని దీపం వెలిగింది. ఇక్కడ ఆకుపచ్చదీపం వెలిగిన సమయంలోనే రైల్వే లైనుమీద వున్న పచ్చదీపం కూడా వెలిగింది. బండి బయలుదేరడానికి అది సంజ్ఞ అన్నమాట. ఆ తరువాత అతడు ఆపరేటర్‌గా పనిచేస్తున్న నీనా కొషలేవ్‌తో కలిసి ప్లాట్‌ఫారమ్‌మీదకి వెళ్ళాడు. ప్రయాణీకుల్లో దాదాపు అందరూ బండిలో యెక్కి కూర్చున్నారు. మూడవ నెంబరు రైలుపెట్టె కండక్టరు పయోతర్ ఖితొనోవ్ చివరిసమయంలో వచ్చిన కొందరు ప్రయాణీకులను పెట్టెలోకి యెక్కమని హెచ్చరిక చేస్తున్నాడు. జోయా పసుపుపచ్చ జండాను ఊపింది. బండి బయలు

యూరా పాలీ, రైలు పోబోతున్నదన్న సూచనగా గంట కొడుతున్నాడు

బోర్యా సెమినోవ్ దారియిస్తూ, ప్రయాణానికి ముందు "పోవచ్చని" సిగ్నల్ యిస్తున్నాడు

డ్రైవర్ విత్యా రెజువిష్కిన్‌కు స్టాఫ్ ఇస్తూ, చీఫ్ గార్డ్ ల్యూబా స్మెతనీనా "సుఖంగా ప్రయాణింతురు గాక" అని చెబుతున్నది

సుందరమైన అరణ్యాలగుండా పోతున్నది రైలుదారి. విత్యా రెజువిష్కి రైలు నడుపుతున్నాడు

దేరడానికి సిద్ధమయింది. హెడ్‌గార్డు సాషా ఇవనోవా ఈల ఊదింది. ఇంజనీర్ విత్యా రెజుష్కి రైలుఇంజన్లోకి యెక్కాడు.

స్టేషను గంట ఆఖరుపర్యాయం మ్రోగింది. హెడ్ గార్డ్ ల్యూదా స్మెతనినా ఇంజనీర్‌కు స్టాఫ్‌ను ఇచ్చింది.

"సౌఖ్యంగా ప్రయాణంచేసి రండి" అన్నది. ఆమె.

బాలలతోపాటు మేముకూడా ప్రయాణం చేశాము. క్రస్నొయార్స్క ఇంజన్ల నిర్మాణ యంత్రాగారం పనివారు తయారుచేసిన ఒక చిన్న ఇంజను లేత ఆకుపచ్చ రంగు వేయబడి వున్న నాల్గు చిన్నరైలు పెట్టెలను లాక్కొని పోతున్నది. ఒక్కొక్క పెట్టెలో 46గురు ప్రయాణికులు వున్నారు.

(మిగతా 38వ పుటలో)



ఆ చిన్న దక్షిణ ఉరల్ దారిన టిక్కెట్టు లేకుండా ఎవరూ ప్రయాణం చెయ్యరు. టిక్కెట్ చెకింగ్ అధికారిణి నటాషా ఇలినాకు అందరూ తమ తమ టిక్కెట్లు హుందాగా చూపిస్తున్నారు

# అగ్నిపర్వత గహ్వరాన





గత సంవత్సరం ఆగస్టు మాసంలో కామచత్కా నదీ తీరంలోని పెత్రోపవ్‌లోవ్స్కకు చెందిన యురి ఇవనోవ్, వొయిస్లావ్ మిలోవ్నోవిచ్ అను ఇద్దరు పర్వతారోహకులు కామచత్కాలోని సజీవ అగ్నిపర్వతాల్లో ఒకటైన అవచిన్స్కయా అగ్నిపర్వతపు బిలంలోకి దిగారు.

మా విలేఖరికి యురి ఇవనోవ్ యిలా చెప్పారు: "అవచిన్స్కయా పర్వత శిఖరాన్ని అధిరోహించి, మంటలు కక్కేదాని బిలంలోకి చూచినవారు చాలామంది 'ఈ బిలంలోకి దిగి అక్కడ యేం జరుగుతున్నదో చూస్తే యెంత తమాషాగా వుంటుంది!' అని భావించుకొని వుంటారు...." పర్వతారోహణ శాస్త్రంలో బోధకుడయిన నా మిత్రుడు ఇంజినీర్ వొయిస్లావ్ మిలోవ్నోవిచ్, నేను ఆ బిలంలోకి దిగి చూడాలని యెంతో కాలంగా కలలుకంటూ వచ్చాము.

ఈ తడవ పర్వతశిఖరానికి యెలాను చేరుకోనే చేరుకున్నాము, కాబట్టి ఈతడవ ఏమైనా సరే బిలంలోకి దిగి చూడాలని నిశ్చయించుకొన్నాము. రెండురోజులపాటు ప్రయాణం చేసి అక్కడికి చేరుకొన్నాము. 2000 మీటర్ల యెత్తున ఒకరోజు గడిపాము.

ఒక బ్రహ్మాండమయిన గరగ (ఫనల్) లాగ వున్న ఆ బిలము భూగర్భంలోకి యెంతో లోతుకు చొరుచుకుపోయి కనబడుతున్నది.

లోపలికి దిగడానికి అనువైన దారికొరకు మేము ఆ బిలాన్ని జాగ్రత్తగా పరిశీలించాము. ఆ బిలంయొక్క గోడలు నిట్రవుగా వుండి దిగడానికి అసాధ్యంగా వున్నాయి.

చాలాసేపు వెదికినమీదట ఆగ్నేయదిక్కున మాకు ఒక 'మార్గం' కనబడింది. ఇది రాయి బీటువారిన రూపంలో వున్నది. ఒకప్పుడు దీనిగుండా లావా ప్రవహించింది. వొయిస్లావ్ మిలోవ్నోవిచ్, నేను ఒక త్రాటితో ఒకరికొకరం బంధించుకొన్న తర్వాత బిలంలోకి ప్రవేశించాము.

---

సచేతనమైన అగ్నిపర్వత గహ్వర ప్రవేశాన్ని హెలికాప్టర్‌లోనుంచి సందర్శించ బడినది (పైన)

*

విమానంలోంచి కనిపిస్తున్న అవాచిన్స్క అగ్నిపర్వత దృశ్యం

---





ప్రారంభంలో కొన్ని మీటర్ల దూరంవరకు మేము అతి జాగ్రత్తగా దిగవలసి వచ్చింది. ఎందువల్లనంటే బిలం గోడలు వదులుగా వున్నాయి. ఎక్కడైనా అజాగ్రత్తగా అడుగు వేస్తే రాళ్లు క్రిందికి దొర్లిపోతూ వుండేవి.

జాగ్రత్తగా ఒక్కొక్కఅడుగే వేసుకుంటూ మేము మరి 150 మీటర్లు దిగాము. బిలం యొక్క అట్టడుగుకు సమీపించసాగాము. ఆకు పచ్చగా, పసుపుపచ్చగా, ఎర్రగా వున్న పెద్ద పెద్ద రాళ్లు అప్పుడే మాకు అగుపడసాగాయి. గంధకపు వాసన వేయసాగింది. చాలా దిగువ నుండి యెక్కడినుంచో ఒక పెద్ద శబ్దం విన బడ సాగింది.

పూర్తిగా నిట్రవుగావున్న చివరి అరవై మీటర్లు మేము త్రాటి సహాయంతో దిగవలసి వచ్చింది.

చిట్టచివరికి బిలం అట్టడుగుకు చేరుకొన్నాం మేము....గడియారం వైపు చూచాను నేను. అందులోకి దిగడం రెండున్నర గంటలు పట్టిం దన్న మాట.

ఆ ప్రదేశం చాలా వేడిగాను, ఇరుకుగాను వున్నది.

గంధక వాయువు మూలంగా ఊపిరిపీల్చ డము కష్టమైపోయింది. కణతలు కొట్టుకొన సాగాయి. కండ్లల్లో నీళ్ళు తిరిగాయి. అక్కడ ప్రాణవాయువు లోపించింది. గాలి పెద్దగా వీచినప్పుడు మాత్రం బిలం బయటినుండి గాలి కొంత లోపటికి వీచి, ఊపిరితీయడం తాత్కా లికంగా కొంత తేలికయ్యేది.

అగ్ని పర్వతపు రంధ్రం అతివేడిగా వున్న పెద్దపెద్ద రాతిబండలతో కప్పబడి వున్నది. వాటిని తాకడం గూడా అసాధ్యమయింది. ఎలానో ప్రయత్నించి మేము ఆ బండలలో ఒకదాని పైకి యెక్కగలిగాము. అన్ని వైపుల

పర్వతారోహకుడు యూరీ ఇవనోవ్ తనసహచరుణ్ణి అగ్నిపర్వత గహ్వరంలోకి దింపుతున్నాడు [ఎడమన పైని]

అగ్నిపర్వతపు అంచున యూరీ ఇవనోవ్ [కుడిన పైన]

అగ్నిపర్వతపు అధోఃలాన [దిగువ]

నుండి వేడిగావున్న ఆవిరి పెద్ద శబ్దంతో బయటికి రాసాగింది. మేము నిలబడివున్న రాయి అదరసాగింది. చెవులు చిల్లులు పడేటట్టు లోనుండి శబ్దం వినబడుతూ వచ్చింది.

అక్కడ మేము ఒక పావుగంటసేపే వున్నా ఒకయుగం గడిచినట్లయింది. సూర్యరశ్మిలోకి, స్వచ్ఛమైన గాలిలోకి సాధ్యమైనంత త్వరగా వెళ్ళిపోవాలని తహతహలాడాము.

తాడును పుచ్చుకొని అతికష్టంతో పైకి ఎగబాకాము. పైకి వస్తున్నకొలది కొంత ఊపిరాడసాగింది. నీలి ఆకాశం మమ్మల్ని ఆహ్వానిస్తున్నట్లు కనబడసాగింది.

చివరి పర్యాయం ఒకసారి బిలంలోకి చూచాము. అలా క్రిందికిచూస్తూ "మేం అక్కడిక దిగి చూచాము" అని తలచుకొన్నప్పుడు యెంత ఆనందంగా వుంటుంది! కాని ఈ విషయాన్ని పత్రికల వాళ్ళకు చెబుదామన్న కోర్కె అప్పటికి మాకు కలుగలేదు.

---

## పిల్లల రైలు

(36వ పుట తరువాయి)

ఈ బాల ప్రయాణీకుల్లో అనేకమంది దక్షిణ ఉరల్స్ రైల్వేలో మొట్టమొదటిసారిగా ప్రయాణం చేస్తున్నారు. ముద్దుగావున్న ఆ చిన్న రైలుపెట్టెలలో ప్రయాణంచేస్తూ వారు యెంతో ఆనందపడుతున్నారు.

చివరి జంక్షన్‌లో బండి ఆగడమే తడవుగా ప్రయాణికులు పెట్టెల్లోంచి బయటికి ఉరికి సమీపంలోనే వున్న అడవిలోకి మాయమయ్యారు. అడవిలో పండ్లు ఏరుకోవాలి, పువ్వులు కోసుకోవాలి, కొలనులో ఈత కొట్టాలి. కాబట్టి కాలాన్ని యేమాత్రం వృధాచేయగూడదు.

కాని రైలుబండి నిర్ణీతమైన సమయానికి తిరిగి బయలుదేరవలసివున్నది. తిరుగు ప్రయాణం కొరకు ఇంజను కూతవేసింది. పువ్వుల గుత్తులు, బుట్టలతో పండ్లు పుట్టగొడుగులు పట్టుకొనివున్న ప్రయాణికులు తొందర తొందరగావచ్చి బండిలో తమతమ స్థానాల్లో కూర్చున్నారు.

ఈ దక్షిణ ఉరల్స్ రైల్వేలలాంటి బాలల రైల్వేలు సోవియట్ దేశంలో ముప్పైకి పైగా వున్నాయి. భవిష్యత్తులో రైల్వేపనివారు కాబోయేవారు అనేకులు దేశంలో అనేక ప్రాంతాల్లో ఇలా శిక్షణను పొందుతున్నారు. కొన్ని సంవత్సరాల తర్వాత వీరే దేశంలోని రైలు మార్గాలపైన నిజమైన రైలుబండ్లను నడుపుతారు. ఈవిధంగా ఈ బాలలు ముందుగా చిట్టి ప్రయాణికులతో, చిన్న రైలుబండ్లను నడుపుతున్నారు. అదుగో, అక్కడ ఒక చిట్టి స్విచ్-మాన్ రైలు మార్గం సుగమంగా ఉన్నదని సిగ్నల్ ఇస్తున్నాడు!

---

## సోవియట్, చైనా దేశాల సంయుక్త ప్రకటన

(8వ పుట తరువాయి)

పైన. ప్రధాన అంతర్జాతీయ సమస్యలపైన సంపూర్ణ ఏకాభిప్రాయం వ్యక్తమయింది. 1954లో జినీవా మహాసభ, 1955లో నాలుగు అగ్ర రాజ్య ప్రభుత్వాధిపతుల సమావేశము, ఆసియా ఆఫ్రికా దేశాల బాండుంగ్ మహాసభ జరిగిన తర్వాత అంతర్జాతీయ పరిస్థితిలో ఉద్రిక్తతా సడలింపువైఖరి వ్యక్తమవుతూ వచ్చింది. విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాలు శాంతియుత సహజీవనం నెరపవచ్చునన్న భావన ప్రజల మనస్సులలో వ్యాపింపజొచ్చింది.

సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులు ఈజిప్టుపైన దాడి జరిపిన ఫలితంగాను, హంగరీలో వారి విద్రోహచర్యల ఫలితంగాను అంతర్జాతీయ పరిస్థితి ఉద్రిక్తతను సడలింపజేసే వైఖరి, ఈశక్తుల అవరోధాలను, విధ్వసంక ప్రతిఘటనను యెదుర్కొనవలసి వచ్చింది. ప్రపంచంలోని సోషలిస్టు ప్రభుత్వాలు, ఇతర శాంతిప్రియ దేశాలు, ప్రభుత్వాల తోడ్పాటుతో ఈజిప్టు, హంగరీ దేశాల ప్రజలు తమ వీరోచితము, కృతనిశ్చితము అయిన పోరాటంలో విజయాన్ని సాధించుకొన్నారు. సామ్రాజ్యవాద దౌర్జన్యశక్తుల కుట్రలు పూర్తిగా అపజయాన్ని పొందాయి. అయినా, సామ్రాజ్యవాదులు దీనిని గుర్తించక తమ దౌర్జన్యపూరిత విద్రోహ చర్యలను కొనసాగిస్తూనే ఉన్నారు.

అంతర్జాతీయ పరిస్థితుల మార్పు ప్రమాదకరమైన మార్గంలో నడుస్తున్నదని వాస్తవ విషయాలు వ్యక్తం చేస్తున్నాయి. ప్రపంచంలోని శాంతి ప్రియదేశాలన్నీ ఎల్లప్పుడూ జాగరూకతతో ఉంటూ సామ్రాజ్యవాద దౌర్జన్యశక్తుల కుతంత్రాలకు వ్యతిరేకంగా నిర్విరామం సుదీర్ఘము అయిన పోరాటాన్ని జరుపడానికి సంసిద్ధపడాలి.

అమెరికా దేశపు గుత్తవ్యాపార ముఠాల నాయకత్వాన సామ్రాజ్యవాద శిబిరం అనుసరించే దురాక్రమణ యుద్ధ సన్నాహక విధానాలకు భిన్నంగా సోషలిస్టు శిబిరదేశాలు ప్రపంచశాంతిని పరిరక్షించి, పరిపోషించే విధానాన్ని స్థిరచిత్తంతో అనుసరిస్తున్నాయని ఉభయ పక్షాలు ఉద్ఘాటించాయి. అదేసమయంలో ఆసియా, ఆఫ్రికాలలోని జాతీయంగా స్వతంత్రమయిన దేశాలు. వాటిలో ప్రధానంగా భారత దేశం, శాంతి, తటస్థ విధానాలను గట్టిగా అనుసరిస్తున్నాయి. శాంతి, తటస్థ విధానాలను అనుసరిస్తున్నటువంటి, లేదా ఆ విధానాలవైపు మొగ్గు చూపుతున్నటువంటి దేశాలు యూరపులోను, ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలోను అనేకం ఉన్నాయి. శాంతికొరకై పాటుపడుతూ, యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్న ప్రజలు అన్ని ఖండాల్లోను నానాటికీ అధికమవుతున్నారు. ముడివస్తువుల కొరకు, మార్కెట్లకొరకు, పలుకుబడి ప్రాంతాలకొరకు జరుగుతున్న పోరాటంవల్ల ఉత్పన్నమయ్యే వైరుధ్యాలు, భేదాభిప్రాయాలు నానాటికి అధికమవుతున్నాయి. కొన్ని సామ్రాజ్యవాద దేశాలలోని దౌర్జన్య శక్తులు తప్ప ప్రపంచ ప్రజలందరూ శాంతిని కాంక్షిస్తూ, యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నారు.

సోషలిస్టు దేశాలు, జాతీయస్వాతంత్ర్యంగల దేశాలు, శాంతిని ప్రేమించే ఇతర దేశాలు, జాతులలోని ఐక్యశాంతి శక్తులు సామ్రాజ్యవాద కూటమియొక్క దౌర్జన్య శక్తులకంటె చాలా శక్తివంతమైనవి. అంతర్జాతీయరంగంలోని శాంతిశక్తులన్నీ ఏకమై, కృతనిశ్చయతతో పోరాడడానికి చేతులు కలిపినట్లయితే, సామ్రాజ్యవాద దౌర్జన్య వర్గాలు జరిపే యెలాంటి కుతంత్రాలనైనా నిస్సందేహంగా వమ్ముగావింపవచ్చును.

### 2

ఈజిప్టుపైన తాము జరిపిన దండయాత్రలో బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రాయిల్ అపజయాన్ని పొందిన తర్వాత అమెరికా సమీప, మధ్య ప్రాచ్యాలలో జాతీయ స్వాతంత్ర్యోద్యమాలను అణచివేసి ఆ దేశాల ప్రజలను బానిసలుగా చేయడానికి ఆ ప్రాంతంలో వలస రాజ్యాల— బ్రిటన్, ఫ్రాన్సుల—స్థానాన్ని ఆక్రమించుకోడానికి ప్రయత్నిస్తున్నదనీ, ఈ ప్రాంతంలో దురాక్రమణ, యుద్ధసన్నాహక విధానాలను రెచ్చగొడుతున్నదనీ ఉభయపక్షాలు గుర్తిస్తున్నాయి.

"ఐసెన్‌హోవర్ పథకం" అన్నదానియొక్క సారాంశం సరిగ్గా యిదే. అమెరికాయొక్క వలస పెత్తందారీ విధానము, ఈజిప్టుపైన ఈ మధ్య జరిగిన దాడివల్ల శత్రుత్వాలకు రంగంగా మారిన సమీప, మధ్యప్రాచ్యాలలో కొత్త ఉద్రిక్తవాతావరణాన్ని సృష్టిస్తున్నది.

సోవియట్ దేశం, చైనా ప్రజారిపబ్లిక్‌ల ప్రభుత్వాలు అమెరికా యొక్క యీ విధానాన్ని గట్టిగా ఖండిస్తున్నాయి. సమీప, మధ్యప్రాచ్య దేశాలపైన దురాక్రమణను, వాటి వ్యవహారాలలో జోక్యాన్ని అరికట్టడానికీ ఆ దేశాల ప్రజలకు అవసరమైన తోడ్పాటును ముమ్ముందుకూడ ఇవ్వడానికి సంసిద్ధంగా వున్నాయి.

ఈజిప్ట్‌పైన సామ్రాజ్యవాద దురాక్రమణ ఫలితాలను పరిపూర్ణంగా తొలగించి వేయడంకొరకు, బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రాయిల్ దేశాలు తమ దురాక్రమణ చర్యలద్వారా గావించిన నష్టానికి సంపూర్ణ పరిహారం ఇవ్వాలన్న ఈజిప్టు ప్రభుత్వపు న్యాయమైన కోర్కె ఆ దేశాలు అంగీకరించడం అవసరమని ఉభయ ప్రభుత్వాలు అభిప్రాయపడుతున్నాయి.

సూయజ్ కాలువను "అంతర్జాతీయ అజమాయిషీ"లో పెట్టడానికి ఉద్దేశింపబడ్డ యే సామ్రాజ్యవాద కుతంత్రాన్నయినా ఉభయ ప్రభుత్వాలు వ్యతిరేకిస్తాయి. సూయజ్‌కాలువగుండా స్వేచ్ఛగా వెళ్ళడానికి సంబంధించిన సమస్యా పరిష్కారం, అందుకు సంబంధించిన దేశాలమధ్య ఈజిప్ట్ సర్వసత్తాధికారంపట్ల సంపూర్ణ గౌరవం అన్న ప్రాతిపదికపైన జరగాలని భావిస్తున్నాయి.

వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడడానికీ, తమ జాతీయ స్వాతంత్ర్యం, సర్వసత్తాధికారం, స్వేచ్ఛలను కాపాడుకొని, సంఘటితం చేసుకోడానికీ, పారిశ్రామిక అభివృద్ధినీ, ఆర్థికస్వాతంత్ర్యాన్నీ సాధించుకోడానికి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని దేశాలు జరిపే ప్రయత్నాలను సోవియట్ దేశ, చైనా ప్రభుత్వాలు హృదయపూర్వకంగా బలపరుస్తాయి.

యుద్ధానికి, వలస విధానానికి వ్యతిరేకంగాను, ప్రపంచశాంతి పరిరక్షణకొరకు జరిగే పోరాటంలో సోషలిస్టుదేశాలు, జాతీయంగా స్వతంత్రమయిన దేశాలు శాంతియుత సహజీవన పంచసూత్రాల కనుగుణంగా సర్వతోముఖ సహకారాన్ని అమలులో పెట్టగలవు. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితుల్లో ఈ మనఃపూర్వక సహకారం అప్పుడే ప్రముఖపాత్రను వహించిందని వాస్తవవిషయాలు తెలియజేస్తున్నాయి. జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న దేశాలతో సోషలిస్టు దేశాలు నెరపే సహకారం, పరస్పర జాతీయప్రయోజనాలకూ, ప్రపంచ శాంతికీ అనుగుణంగా వుంటున్నది.

## 3

జాతీయ విముక్తి ఉద్యమాన్ని అణచివెయ్యడంలోనూ, తమ జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న దేశాలకు వ్యతిరేకంగా దౌర్జన్యాన్ని సాగించడంలోనూ దౌర్జన్య సామ్రాజ్యవాద కూటాలు సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా విధ్వంసక కార్యకలాపాలను నడపడానికి తమ ప్రయత్నాలను వదులుకోవని ఉభయ ప్రభుత్వ ప్రతినిధివర్గాలూ గమనించాయి. హంగెరీలో సాయుధ తిరుగుబాటును సామ్రాజ్యవాద దౌర్జన్యవర్గాలు, హంగేరియన్ శ్రామిక ప్రజలలోనూ, యువజనులలోనూ పూర్వపు నాయకత్వం చేసిన తప్పులవల్ల కలిగిన అసంతృప్తిని ఉపయోగించుకున్న ప్రతి విప్లవశక్తులూ రెచ్చగొట్టాయి. హంగెరీలో సోషలిస్టు వ్యవస్థను నాశనం చేయడానికీ, ఫాసిస్టు నియంతృత్వాన్ని పునరుద్ధరించడానికీ, తద్వారా యూరప్‌లో ఒక యుద్ధకారక స్థానాన్ని సృష్టించడానికీ అవి ప్రయత్నించాయి. హంగెరీలో తాము చేసిన కుట్రద్వారా, సోషలిస్టు దేశాలను విడగొట్టే తమ పన్నాగాలు అమలు జరిపేందుకు ఒక చీలికను కలిగించడానికీ, ఒకదాని తరవాత ఒకటిగా వాటిని చావగొట్టడానికీ అవి ప్రయత్నించాయి.

సోవియట్ దేశపు సహాయంతో హంగేరియన్ సోషలిస్టు కార్మికపార్టీ, కార్మిక కర్షక విప్లవ ప్రభుత్వాల నాయకత్వాన హంగేరియన్ ప్రజలచే ప్రతి విప్లవశక్తులు పొందిన త్వరిత పరాజయం, శాంతి, సోషలిజం ఆశయానికొక ప్రధాన విజయం.

ప్రతి విప్లవ తిరుగుబాటును అణచివేసేందుకు హంగేరియన్ ప్రజలకు తోడుపడడం ద్వారా సోవియట్‌దేశం హంగెరీ, తదితర సోషలిస్టు దేశాల శ్రామిక ప్రజలపట్ల తనవిధిని నెరవేర్చింది; ప్రపంచ శాంతి రక్షణ ఆశయాలకిది పూర్తిగా అనుగుణంగా వుంది.

ఇటీవల దౌర్జన్య సామ్రాజ్యవాద కూటాలు ప్రచ్ఛన్న యుద్ధాన్ని తీవ్రతరంగావిస్తూ, సోవియట్ దేశానికి వ్యతిరేకంగా, కమ్యూనిజంకు, శాంతి ఆశయానికి వ్యతిరేకంగా విధ్వంసక కార్యకలాపాలను సాగిస్తున్నాయి. ఈ పన్నాగాలు సాగుతూ వున్నప్పుడు జాగరూకతతో వుండడం అవసరం. తమసోదర మైత్రిద్వారా, పరస్పరసహాయ బాధ్యతలర్వారా సోవియట్‌దేశం, చైనా సకల సోషలిస్టు దేశాలతోనూ ఐక్యంగా వున్నాయి. సోషలిస్టు దేశాలను విచ్ఛిన్నం గావించే ఉద్దేశంతో దౌర్జన్య సామ్రాజ్యవాదశక్తులుచేసే ఎటువంటి కోపకారణమైన చర్యలకైనా, అత్యంత దృఢనిశ్చయంతో కూడిన యెదురుదెబ్బ తగులుతుంది.

## 4

ఈ రెండు దేశాల ప్రభుత్వాలు అనుసరిస్తూన్న విదేశాంగ విధానాల అచంచలమైన పునాదికి మూలం, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవన సూత్రాన్ని అమలుజరపడమేనవి ఉభయపక్షాలూ పునరుద్ఘాటించాయి.

శాంతియుత సహజీవన పంచసూత్రాల ప్రాతిపదికపైని చాలా దేశాలతో సోవియట్ దేశమూ, చైనా మిత్రతా సహకార సంబంధాలను పెంపొందించుకుంటున్నాయనీ, తద్వారా ప్రపంచ శాంతికి దోహదం చేస్తున్నాయనీ ఉభయపక్షాలూ సంతృప్తితో గమనించాయి.

సోవియట్ దేశమూ, చైనా అమెరికాతో శాంతియుత సహజీవనాన్ని స్థాపించుకోడానికి ప్రయత్నిస్తాయి కూడా; యిందుకు ఉచితమైన కృషినిచేశాయి. దురదృష్టవశాత్తు, ప్రపంచాధికారానికి అమెరికన్ గుత్తవ్యాపారవర్గాల ప్రయత్నాలు, వాటి దౌర్జన్యవిధానం, యుద్ధసన్నాహాలూ అంతర్జాతీయ సంబంధాలలో అభివృద్ధిని నిరోధిస్తాయి: ప్రత్యేకంగా సోవియట్ దేశం, అమెరికామధ్య, చైనా, అమెరికామధ్య కూడా సంబంధాల అభివృద్ధిని ఆటంకపరుస్తాయి. చైనా ప్రజారిపబ్లిక్ విషయంలో అమెరికా విరోధవిధానాన్ని అనుసరిస్తోంది. అమెరికా విరోధవిధానాన్ని అనుసరిస్తూవున్నప్పటికీ, చైనా ప్రజారిపబ్లిక్ అస్తిత్వంలో వుంటూవుండడమే కాకుండా, సోషలిస్టుపథాన జయప్రదంగా పురోగమిస్తూవుంది, పెంపొందుతోంది, బలపడుతోందికూడా. చైనా ప్రజారిపబ్లిక్ పట్ల అమెరికా యొక్క యిటువంటి అవాస్తవిక విధానం ప్రపంచశాంతిని తీవ్రంగా గాయపర్చడం మాత్రమే కాకుండా, అమెరికాకే శ్రేయస్సును చేకూర్చదు కూడా.

ఉభయపక్షాలూ సోవియట్-జపానీస్ దౌత్య సంబంధాల పునరుద్ధరణకు స్వాగతమిస్తాయి, చైనా జపాన్ దేశాలమధ్య సాధారణ సంబంధాలను నెలకొల్పడానికి యింకా కృషిచేయడం ప్రస్తుతావశ్యకమని విశ్వసిస్తాయి. జపాను, సోవియట్ దేశం, చైనాల మధ్య స్నేహసహకారాలను పటిష్టపరచడం సోవియట్ దేశం, చైనా ప్రజారిపబ్లిక్ ప్రయోజనాలకు అనుగుణంగా వుండడం మాత్రమేకాకుండా జపాను ప్రజల ప్రధానాశయాలకు అనుగుణంగా వుంటుంది కూడా.

సోవియట్, చైనా ప్రభుత్వ ప్రతినిధివర్గాలు జర్మనీ, కొరియా, వియత్-నామీస్ ప్రజలు శాంతియుతమైన, ప్రజాస్వామ్య ప్రాతిపదికపైని తమ దేశాల పునరేకీకరణకొరకు సాగిస్తోన్న కృషి పట్ల తమ అండదండలను పునరుద్ఘాటించాయి.

అన్ని ప్రత్యేక సైనికకూటాల స్థానంలో సమిష్టిశాంతి, సమిష్టి భద్రతా వ్యవస్థ రావాలని ఉభయపక్షాలూ విశ్వసిస్తాయి. దౌర్జన్య సైనిక ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక జరిగిన తరవాత యూరప్‌లోని సోషలిస్టు దేశాలు స్థాపించుకోవలసి వచ్చిన ఒక ఆత్మరక్షణ సైనిక కూటమి, వార్సా ఒడంబడిక. వార్సా ఒడంబడిక దేశాలు ఉత్తర అట్లాంటిక్, వార్సా ఒడంబడికలను రద్దుచేయాలనీ, వాటి స్థానంలో యూరప్‌లో ఒక సమిష్టి భద్రతా ఒడంబడికను చేసుకోవాలనీ ఏక రీతిని ప్రతిపాదిస్తాయి. ఈ ఉభయ దేశాల ప్రభుత్వాలు మనీలా, బాగ్దాద్ ఒడంబడికలను రద్దుచేయాలనీ, వాటి స్థానంలో ఆసియా లోనూ, పసిఫిక్‌లోనూ ఒక సమిష్టిశాంతి ఒడంబడికను చేసుకోవాలని కూడా వాంఛిస్తాయి.

సోవియట్ దేశం, చైనా ప్రభుత్వాలు నిరాయుధీకరణ గురించి అగ్రరాజ్యాలమధ్య ఒడంబడిక జరగడం అన్నది ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితికి అత్యంత ప్రధానమైనదని విశ్వసిస్తాయి. చైనా ప్రభుత్వం 1956 నవంబరు 17న సోవియట్ ప్రభుత్వం చేసిన నిరాయుధీకరణ ప్రతిపాదనలకు తన తోడ్పాటును వ్యక్తపర్చి, యీ ప్రతిపాదనలను అంగీకరించడం, శాంతిని దృఢపరచడానికి, సకల దేశాలమధ్య పరస్పర అవగాహనను, విశ్వాసాన్ని స్థాపించడానికి యిది ఒక ముఖ్య చర్యగా వుంటుందని విశ్వసిస్తోంది. మానవకోటి ప్రధానాశయాలకు అనుగుణమైన నిరాయుధీకరణపై ఒడంబడికను చేసుకోవడానికి, ఉభయ ప్రభుత్వాలూ తమ శాయశక్తులా కృషిచేస్తాయి.

## 5

సోషలిస్టు దేశాల సన్నిహిత ఐక్యత, స్నేహపూర్వక సహకారమూ, సోషలిజం ఆశయ పరిరక్షణకూ, ప్రపంచ శాంతిని బలవర్ధకం చేయడానికీ దృఢమైన హామీ. సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద దౌర్జన్య వర్గాలు తమ విధ్వంసక కార్యాలను రెచ్చగొట్టే కార్యకలాపాలనూ సాగిస్తూవున్న యీ ప్రస్తుత పరిస్థితులలో, సోషలిస్టు దేశాలమధ్య ఐక్యతా సహకారాలను యింకా సంఘటితపరచడం చాలా ముఖ్యమవుతుంది.

కమ్యూనిజం భావం, ఆశయం సోషలిస్టు దేశాలను ఐక్యపర్చుతున్నాయి; అందువల్ల వాటి పరస్పర సంబంధాలు మార్క్సిజం-లెనినిజం ఉద్బోధపైని, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాలపైని ఆధారపడి వున్నాయి. అదేసమయంలో సోషలిస్టుదేశాలు స్వతంత్రమైన సార్వభౌమ దేశాలు, వాటిమధ్య సంబంధాలు లెనినిస్టు జాతీయ సమాన సూత్రాలపైని ఆధారపడివున్నవి కూడా. సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలు, ఒక కొత్త తరహా అంతర్జాతీయ సంబంధాలు. అత్యంత ప్రధానమైన ప్రయోజనాలకు యీ సంబంధాలు లోబడి వుంటాయి; ఆ ప్రయోజనాలు—సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటంలో విజయం, వివిధ దేశాలలో సోషలిజం నిర్మాణంలో విజయం, కమ్యూనిజం విజయం కొరకు ఉమ్మడి పోరాటంలో విజయం. పైసూత్రాల ప్రాతిపదికపైని సోషలిస్టు దేశాల ఐక్యతను దృఢపరచడమూ, సంఘటితపరచడమూ సోవియట్, చైనాదేశాల అత్యంత ప్రధానమైన అంతర్జాతీయ విధి.

సోషలిస్టు దేశాల ఐక్యతను భగ్నం గావించడానికీ, చీల్చడానికీ ఛాందసత్వంపైని, సంకుచిత జాతీయ భావాలపైని, కొన్ని జాతీయ శత్రుత్వ అవశేషాలపైని జూదం ఆడేందుకు సామ్రాజ్యవాదుల కుటిల పన్నాగాలు చివరికి వ్యర్థమని భావింపక తప్పదు.

సోషలిస్టు దేశాల సంబంధాలలో ముఖ్యమైన వైరుధ్యాలూ, విరుద్ధ ప్రయోజనాలూ లేవు. ఈ సంబంధాలలో గతంలో కొన్ని పొరపాట్లూ లోపాలూ వుండివున్నా, ప్రస్తుతం అవి అధిగమింప బడుతున్నాయి. తొలగింపబడుతున్నాయి. అంతేకాకుండా యీ పొరపాట్లూ, లోపాలూ సోషలిస్టుదేశాల సంబంధాలలోని మూల, ప్రధానలక్షణాన్ని—పరస్పర సహాయం, సహకారం అన్న లక్షణాన్ని—ఏవిధంగానూ హరించి వెయ్యలేవు. సోషలిస్టు దేశాలమధ్య సంబంధాలకు చెందిన ఏ విషయాన్నయినా, ఐక్యతా ప్రాతిపదికపైన, నిర్మోహమాటమైన సంప్రదింపులు, స్నేహపూర్వక చర్చలద్వారా పూర్తిగా పరిష్కరించవచ్చునని యదార్థ విషయాలు తెలియజేస్తున్నాయి. సోషలిస్టు దేశాల ఐక్యతనూ, వాటి సంబంధాలలో ఒకొక్క దేశపు స్వాతంత్ర్యాన్నీ సమన్వయ పరచడం పూర్తిగా సుసాధ్యం.

సోవియట్ దేశానికీ యితర సోషలిస్టు దేశాలకూమధ్య స్నేహ సహకారాలను యింకా పెంపొందించే, యింకా పటిష్ఠపరిచే సూత్రాల గురించి 1956 అక్టోబరు 30వ తేదీన సోవియట్ ప్రభుత్వం చేసిన ప్రకటన, చైనా ప్రభుత్వం యీ సోవియట్ ప్రభుత్వ ప్రకటనకు తన తోడ్పాటుగురించి 1956 నవంబరు 1వ తేదీని చేసిన ప్రకటన సంపూర్ణ సమానత్వం, భూభాగ అఖండత్వ స్వాతంత్ర్య సార్వభౌమత్వాలపట్ల గౌరవం, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో యింకొకరు జోక్యం కలుగ జేసుకొనకపోవడం అన్న ప్రాతిపదికపైని సోషలిస్టు దేశాల ఐక్యతను దృఢతరం గావించవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పాయి. పై సూత్రాల ప్రాతిపదికపైని సోషలిస్టు దేశాలు తమ సంబంధాలను పెంపొందించు కుంటున్నందుకు, దృఢతరం గావించుకుంటూన్నందుకూ ఉభయపక్షాలూ తమ సంతృప్తిని వెల్లడించి, సోషలిస్టు దేశాల మధ్య యింకా స్నేహసహకారాన్ని దృఢతరం గావించేందుకు శాయశక్తులా కృషి చేస్తామని ప్రకటిస్తున్నాయి.

## 6

సోవియట్ చైనాదేశాల మైత్రి, ఐక్యత సోషలిస్టుదేశాల మహత్తర ఐక్యతలో ఒక అతిముఖ్యమైన అంశం. 1950 లో సోవియట్ చైనా దేశాలమధ్య స్నేహ. మిత్రతా, పరస్పర సహాయ ఒడంబడిక జరిగినప్పట్నుండీ యీ రెండుదేశాల మధ్య స్నేహ, సహకార సంబంధాలు గొప్పగా వృద్ధి చెందినాయనీ, రెండుదేశాల ప్రజలు శాశ్వతంగ సమీకృతులైనారనీ ఉభయపక్షాలూ గాఢ సంతృప్తితో గుర్తిస్తున్నాయి. సోవియట్ చైనాదేశాల మహత్తరమైత్రి, యీ రెండుదేశాల అవిచ్ఛిన్నమైన ఐక్యత ప్రపంచమంతటా శాంతికి ఒక ముఖ్యమైన అండగ వున్నాయని, గత కొద్ది ఏళ్ళ ఘటనలు తెలియజేస్తున్నాయి.

సోవియట్‌దేశం, చైనా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగలలో యీ రెండుదేశాల మధ్య పరస్పర సహాయ సహకార సంబంధలను పెంపొందించేందుకు శాయశక్తులా కృషిచేయడం సాగిస్తూనే వుంటాయి; సోషలిస్టుదేశాల ఐక్యతను రక్షించడానికీ, దృఢపరచడానికీ సకల విధాలా కృషిచేయడం సాగిస్తూనే వుంటాయి; శాశ్వత ప్రపంచ శాంతికొరకు పోరాటంలో సకల శాంతికాముక దేశాల, ప్రజల ఆశయలను ఏకం గావించడం సాగిస్తూనే వుంటాయి.

ఎన్. ఎ. బుల్గానిన్,
సోవియట్ దేశ మంత్రివర్గాధ్యక్షుడు

ఛౌ ఎన్-లై,
చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వ సమితి ప్రధాని, విదేశాంగ మంత్రి

మాస్కో, జనవరి 18, 1957.

బాలానందం

# నాలుగు పెన్సిళ్లు

ఒక పెట్టెలో నాలుగు పెన్సిళ్ళు—ఎరుపు, నీలి, ఆకుపచ్చ, పసుపు పచ్చ రంగులవి—పడిఉన్నాయి. ఒకనాడవి బయటికి తొంగి చూచాయి. ఒక పిల్లవాడు చిన్నపడవలో కూర్చొని చేపలు పట్టడానికి గాలంవేసిన చిత్రం కనబడింది. అతని కుక్క ఒడ్డున కూర్చొని చేప పడుతుందేమోనని చూస్తున్నది.

ఈ చిత్రం పెన్సిళ్ళకు బాగా నచ్చింది.

"ఈ చిత్రానికి రంగులు వేద్దాము," అన్నది ఎర్ర పెన్సిలు.



వెంటనే తేలియాడుతున్న గాలానికీ, పిల్లవాని నెక్టైకి రంగువేసేసింది.

"తప్పకుండా వేద్దాము," అన్నది నీలి రంగు పెన్సిలు. వెంటనే నదిలో నీళ్లు, పిల్ల వాని లాగు నీలంగా మారిపోయాయి.



ఆకుపచ్చరంగు పెన్సిలుకూడా ఊరికే కూర్చోలేదు. కొద్ది సేపట్లో విల్లోచెట్ల ఆకులు ఆకుపచ్చ రంగుకు మారాయి.

ఈ లోగా పసుపుపచ్చరంగు పెన్సిలు ఇసుకకు, కుక్కకు రంగువేసింది. ఆ తర్వాత నాలుగు పెన్సిళ్లూ చిత్రంవైపు యెంతో ఆనం దంగా చూచాయి.

"ఆగండి", అంటూ హఠాత్తుగా కేకవేసింది ఎర్ర పెన్సిలు. "పడవ మాటేమిటి? దానినిగురించి మర్చిపోయాము"

అప్పుడు, నాలుగు పెన్సిళ్లూ పనిచేయడం ప్రారంభించాయి. ప్రతి పెన్సిలు తనకు సాధ్యమై నంత చక్కగా పడవకు రంగువేసింది.

"ఇప్పుడీ చిత్రం వాస్తవమైన దృశ్యం లాగానే ఉన్నది." అనుకున్నాయి. నాలుగు పెన్సిళ్లూ, తాము చేసినపనికి యెంతో సంతృప్తిని పొందుతూ విశ్రాంతి తీసుకోడానికి పెట్టెలోకి వెళ్ళిపోయాయి.

నిజంగానే చక్కని పనిని చేశాయి.

ఇప్పుడు మీ పెన్సిళ్ళతోగూడా ఆ చిత్రానికి రంగు వేయించండి.

---

## విషయసూచిక




భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు; పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లి.

SOVIET LAND








Regd. No. D-154